# నే నె వ రు ?

సర్వసంశయవిచ్ఛేదినీ (ఉపక్రమణికా) సహితము



ర చ యి త :
శ్రీపరానందనాథాపరనాముండు
మన్నెపంతుల వెంకట సత్యనారాయణ శర్మ

★

శ్రద్ధు య వ య్యా ల న
శ్రీ శ్రీయానందనాథాపరనాములు
బ్రహ్మశ్రీ కంచప్పర సత్యనారాయణశర్మ గారికి
అం కి త ము.

★

ప్ర కా శ కు లు :
సా ధ న గ్రం థ మం డ లి, తె నా లి.

వెల. రు. 0—12—0

సాధన గ్రంథ మండలి 74.

# నే నెవరు?

సర్వసంశయవిచ్ఛేదినీ (ఉపక్రమణికా) సహితము.

రచయిత:
శ్రీ పరానందనాథాపరనాముఁడు
మిన్నికంటి వెంకటసత్యనారాయణశర్మ

★

తద్గురువర్యులగు
శ్రీ శ్రియానందనాథాపరనాములు
బ్రహ్మశ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారికి
అంకితము.



ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి,

 1959 [వెల రు. 0-12-0

శ్రీ శర్మగారి గ్రంథములను ముద్రణ యోగ్య
ముగా వ్రాసియిచ్చిన శ్రీవారి ప్రియశిష్య పుత్రికా
నిర్విశేషాదృత, పుణ్యవతి చి॥ సౌ॥ తావలూరి సరో
జమ్మగారు పాఠకలోకాశీర్వాద పాత్రురాలు

★

జానకిరాం ప్రెస్, తెనాలి.

# పీఠిక

శ్లో॥ వేదమయీం నాదమయీం
బిందుమయీం పరపదోద్యదిందుమయీం,
మంత్రమయీం తంత్రమయీం
ప్రకృతిమయీం నౌమి విశ్వ వికృతిమయీమ్॥

ఉర్వరాభూమియందు బీజమువలె సచ్ఛాత్రునియందు విద్య స్వల్పకాలముననే సమ్యక్ఫలదాయి కాగలదు. శిష్యునకు సద్గురువును, గురువునకు సచ్ఛిష్యుఁడును దుర్లభులు. ప్రస్తుత మా దుర్లభు లన్యోన్యసులభులైరి. శ్రీ చి॥ సత్యనారాయణశర్మగారు శ్రీ విద్యారణ్యులగు శ్రీ శ్రియానందనాథుల యుపదేశమునంది పరానందనాథులైరి. తోడనే ప్రాదుర్భవించిన ప్రశ్న "నే నెవరు ?". మేధావియగు శిష్యుఁడు గురూపదిష్టమైన సద్విద్యచేఁ బ్రశ్నకు సమాధానమును గనుఁగొనెను. ఆ సమాధానమే యీ గ్రంథము.

చిత్రం వటతరోర్మూలే వృద్ధాశ్శిష్యా గురుర్యువా।
గురోస్తు మౌనవ్యాఖ్యానం శిష్యాస్తుచ్ఛిన్న సంశయాః॥

అని మేధాదక్షిణామూర్తిని గూర్చిన వినుతి. ప్రస్తుతము ఛిన్నసంశయుఁడైన శిష్యుఁడు గురువిషయమున మేధాదక్షిణామూర్తినే స్ఫురింపఁజేయుచున్నాఁడు. అందుచే నా గురువును, నీ శిష్యుఁడును ధన్యులు.

ప్రాచీన భారతీయ మునిపుంగవుల హృదయములందీ ప్రశ్న (నే నెవరు ?) మొలకెత్తెను. తత్ఫలితముగా నుపనిషత్తు లుద్భవించెను. అనంతర్యులగు మనీషుల నెందఱనో యీప్రశ్న

కలవరపెట్టెను. మార్గములు భిన్నములైనను కనుఁగొనిన సమాధానమొక్కటియే. ఆ సమాధానము 'అహంబ్రహ్మాస్మి' అను మహావాక్యము. అట్లే ప్రస్తుతగ్రంథకర్తగూడ స్వహృదయోద్భూతమగు 'నేనెవరు?' అనుప్రశ్నకు సమాధానముగా

"దేవీ హ్యేకాగ్ర ఆసీత్। సైవజగదండ మసృజత్। తస్యా ఏవబ్రహ్మా అజీజనత్ । విష్ణురజీజనత్। రుద్రోఽజీజనత్। సర్వం శాక్తమజీజనత్ । యదస్తి సన్మాత్రం । యద్విభాతి చిన్మాత్రం । యత్ప్రియమానందం । తదేతత్ సర్వాకారా మహాత్రిపురసుందరీ"

ప్రజ్ఞానం బ్రహ్మ । అహం బ్రహ్మాస్మి । అని శాక్తమతానుసారము శ్రుతి స్మృతి పురాణాద్యుదాహరణములతో శ్రీ దేవీస్వరూపము నిందుఁ జక్కఁగా వివరించియుండెను.

శ్రీ చి॥ సత్యనారాయణశర్మగారు ఆంగ్లాంధ్ర సంస్కృత భాషలయందు సమ్యక్పరిచితి గలవారగుటచే విషయమువలె రచనకూడ గంభీరముగ సాగినది. గురువర్యులగు శ్రీ శ్రియానందనాథుల యాశీర్వచనముల నంది గ్రంథకర్త ఇతోధిక పాండితీమహితములగు గ్రంథముల ననేకములను రచించి అంబికా పాదారవింద మిళిందాయమానమానసులయి యందగ్రగణ్యుఁడై వరలుగాత! అని యాశీర్వదించుచున్నాను.

ఇతి శమ్.

— విద్వాన్, బులుసు సూర్యప్రకాశశాస్త్రి



# మనవి

మహాశయులారా!

మండలి కీ గ్రంథసుమముతో ద్వాదశవర్షములు నిండినవి. బాల్యముదాటి కౌమారమున నడుగిడుచున్నది. ఈ పండ్రెండు వత్సరములనుండి మండలిచేసిన కృషి పాఠకులు గ్రహించియేయుందురు. నేటివరకు పోషకులు మండలికి సహకరించుచు చూపిన ఆదరాభిమానములకు కృతజ్ఞత.

ప్రస్తుతము కాగితపుధర విపరీతముగా పెరిగియున్నది. అయినను యథాశక్తిగా మండలి తన ధర్మమును నిర్వర్తించుటకు పురోగమించుచునేయున్నది. ఇందుకు పాఠక పోషకుల సమాదరణయె ప్రధానము. మండలి సభ్యులలో కొందరు లోగడ 2, 3 సం॥రముల పారితోషిక మివ్వవలసియున్నది. అట్టివారు దయయుంచి తమతమసభ్యత్వపు పారితోషికమును వెంటనేపంపి మండలికృషికి తోడ్పడుదురుగాక.

పూజ్యులు, పితృపాదులు బ్రహ్మశ్రీ ఈశ్వర సత్య నారాయణశర్మగారు, ఉత్తమగ్రంథప్రకటనముచే సాధకలోకమును సమాదరించు మా సాధన గ్రంథ మండలి సత్కృషిని సమ్యగ్దృష్టిచే సమీక్షించి, అభినందించుచు "నే నెవరు?" అను నీ గ్రంథ ప్రకాశమునకు సంపూర్ణ ఆర్థికసహాయము గావించిరి. మరువరాని శ్రీ శర్మగారి సహకారమునకు సర్వదా కృతజ్ఞతాపూర్వక నమస్కారము లర్పించుచుంటిని.

వికారి చైత్రము }
మార్చి 1959 }

వ్యవస్థాపకుడు
సాధన గ్రంథ మండలి

# విషయ సూచిక



గమనిక :- మహామాయ శబ్దముచేఁ బ్రతిపాద్యమగు తత్త్వము పరబ్రహ్మ రూపిణి యగు పరశివాభిన్న శక్తియే, కాని లౌకిక శాస్త్రీయ దృక్పథానుసారముగా, కాల్పనిక భ్రాంతిజన్య విషయ విపర్యయ జ్ఞానము కాదని పాఠకులు విస్మరింపకుందురుగాక.



కృతిపతి:

శ్రీ శ్రియానందనాథాపరనామధేయ

ఈశ్వర సత్యనారాయణ శర్మ



కృతికర్త :

శ్రీ పరానందనాథాపరనాముఁడు

మిన్నికంటి వెంకట సత్యనారాయణ శర్మ

శ్రీమాత్రే నమః

శ్రీ మహారాజ్ఞై నమః, శ్రీమత్సింహాసనేశ్వర్యై నమః

# ప్రార్థన

శ్లో॥ త్రైలోక్యాం హ్రీం ద్విభుజకలితాం ద్వావసీ ధారయన్తీం
సింహస్థాం శ్రీం దినకరసహస్రప్రభాభాసమానామ్,
కామేశీం ద్రాం హృదయకుహరే బాణదేవీం పరాం తాం
వందే గుర్వీం హరిహరనుతాం పీతవర్ణాంబరాఢ్యామ్॥

శ్లో॥ బ్రాహ్మీం శక్తిం జననహరణీం భూర్భువః స్వః ప్రతిష్ఠాం
చాతుర్వింశ్యాం పరమపదవీం యఃప్రయచ్ఛత్ మహాత్మా
అద్వైతాత్మా పరిస్పృతపదః సర్వతంత్రస్వతంత్రః
తం వందేఽహం గురుమహరహః శ్రీకుటుంబాభిరామమ్॥

శ్లో॥ చిద్రూపం తం త్రిభువనతనుం భూమిబింబాంతరస్థం
మధ్యే పద్మే స్వరవసుదళే నాగషట్కోణయుక్తే,
ఆకాశాగ్రే మిథునచరణం త్రైపురం శక్తిభావం
వందే దేవం గురుమహరహః శ్రీ శ్రీయానందనాథమ్॥

శ్లో॥ పరాఽహం భావపారమ్య నిరతేభ్యో నిరంతరమ్,
సంవిద్భావస్వరూపేభ్యః సోదరేభ్యో నమో నమః॥

శ్రీమాత్రే నమః

# కృతి సమర్పణము

శ్రీ మాతృస్వరూపులును, దివ్యజ్ఞాన సంపన్నులును నగు పాఠకులకుఁ దాదాత్మ్యభావనతో నే జేయు నమస్కారములు.

నేను శ్రీవత్ససగోత్రుఁడను, ఆపస్తంబసూత్రుఁడను, యజుశ్శాఖాధ్యాయిని. తత్త్వవిద్యాభ్యాసమునందు బ్రహ్మశ్రీ చింతలపాటి వీరనీలకంఠ కుటుంబరామశాస్త్రిగారు గురువులు. విశేషించి వేదమాతయగు గాయత్రి నెఱిగించినవారు. తత్త్వానుభూతిం గలిగించినది వనాఖ్యయగు బ్రహ్మస్వరూపిణి. నా పూర్వనామము మిన్నికంటి వెంకట సత్యనారాయణశర్మ. జననము గుంటూరుజిల్లాలోని మిన్నికల్లు అను గ్రామము. మా తల్లిగారి నామము మహాలక్ష్మమ్మ. తండ్రిగారి పేరు వెంకటనృసింహము.

శ్రీ శ్రియానందనాథులు నాకు శ్రీగురువులు. వీరే స్వగురువులు. శ్రీవిద్యానందనాథులు పరమగురువులు. శ్రీమహావిద్యానందనాథులు పరమేష్ఠిగురువులు. శ్రీ పరిపూర్ణప్రకాశానందనాథులు పరాపరగురువులు. శ్రీ శ్రియానందనాథ దీక్షానాములగు కృతిభర్తలు నా గురుదేవులు. శ్రీ మాత్రాజ్ఞానుసారము శ్రీ శ్రియానందనాథులు స్వస్తిశ్రీ హేవిలంబినామ సం॥ కార్తీకశుక్ల నవమీ శుక్రవారమునాడు (1-11-1957) సూర్యోదయాది గం. 11-10 ని.లకు ధనుర్లగ్నమున నన్ను శ్రీ పరానందుని గావించిరి. సంపూర్ణదీక్షాప్రదానము శ్రీహర్షవల్లీ దివ్యసూర్యక్షేత్రమునఁ బెద్దల సన్నిధిని జరిగినది. మా

కుటుంబమునకు రాకపోకలకైన ఖర్చులతోఁ సహా దీక్షా ప్రదానమునకైన ధనవ్యయము నంతటిని శ్రీ గురుదేవులే భరించిరి. దీక్షా ప్రదానసమయమున నేను పరానందుఁడనని నన్ను ప్రబోధించిరి.

పరానంద శబ్దార్థమును శ్రుతి యిటుల నుపదేశించు చున్నది. 'అహమేవ పరానందః = అహమేవ పరాత్ పరః' అహమేవ పరానందః = అస్మచ్ఛబ్దవాచ్య మగునదియే పరానందశబ్దవాచ్యము. అహమేవ పరాత్ పరః అస్మచ్ఛబ్దవాచ్య మగునదియే పరాత్ పరమునునై యున్నది. సర్వసామాన్యముగ భేదదృష్టికిఁ గోచరమగు 'నేను' అను పదార్థము బాహ్యాత్మస్వరూపము. అట్టి బాహ్యాత్మకంటెఁ బరమైనట్టి దానిని పరము అందురు. బాహ్యాత్మకంటెఁ బరమైనది అంతరాత్మ. పరాత్ =పరముకంటెను, అనఁగ అంతరాత్మకంటెను పరః= పరమైనది. అది పరాత్ పరము. పరమాత్మ పరాత్ పరము. "బాహ్యాత్మా - అంతరాత్మా - పరమాత్మా చేతి" అను శ్రుతి వాక్య మిందులకుఁ బ్రమాణము. కావున పరమాత్మతత్త్వమే పరానందశబ్దవాచ్యము. నేను పరమాత్మనని శ్రీగురుదేవులు పూర్ణ దీక్షాప్రదాన సమయమునఁ బ్రబోధించిరి. అందువలన "నేనెవరు?" అనెడు విమర్శనే శ్రీ గురుదేవులకు గురుదక్షిణగ సమర్పించుట యుచితమని తోఁచినది. "వత్సా! నీవు బాహ్యాత్మవు గావు. పరమాత్మవే. ఈ సత్యమును మఱువకుండునటుల నిన్ను పరానందదీక్షానాముని గావించుచున్నాను." అని గురుదేవులు పరానందనామకరణ మొనరించిరి. ఇపుడు నా పేరే మిదయో నే నూహించినపుడెల్లను నే నెవరో నాకు స్ఫురించు చుండును. ఇట్టి మహనీయులకే 'గురు' శబ్దము చెల్లుచున్నది.

గురు శబ్దార్థమును శ్రుతు లిటుల నుపదేశించుచున్నవి. గుకార మంధకారము. అదియే తమస్సు. అదియే అంతస్త మముగల మూలాధారము. రుకారము తమోపహామును, గుకారాంతరంగముగను, తదంతర్గతమును, కోటిసూర్యరూపమును, పూర్ణచంద్రాభమును, సర్వమూలమగు ఆధారమును నగు మూలాధారశక్తిస్వరూపము. అదియే కుండలినీశక్తి.

శ్రుతి:— గుశబ్దస్త్వంధకారఃస్యాత్ రుశబ్దస్తన్నిరోధకః॥
శ్రుతి:— కుండలినీ తత్ర తమోనివృత్తిః॥

అందువలన మూలగురుస్వరూపము మూలాధారమగుచున్నది. మూలాధారము నుండియే సహస్రారజననమనునది పారంపర్యముగ నుపదేశ రూపమున నున్న సత్యమగు రహస్యము. అట్టి రహస్యముపై నాధారపడియే గురుపాదుకలు సహస్రారమున న్యసింపఁబడుచున్నవి. ఈ మూలసిద్ధాంతముపై నాధారపడియే పంచపూజలందు మొదట 'లం పృథివ్యాత్మనే' అనియు, పిదప 'హం ఆకాశాత్మనే' అనియు పూజాక్రమము విధింపఁబడినది. ఇట్టి మహాతత్త్వరహస్యము నుపదేశించి సర్వశరీరస్థచైతన్య బ్రహ్మోపాసనా విధానము నుపదేశించు గురువులే గురువులు. శిష్యుల నిజస్వరూపమును శ్రుతి యిటుల వచించుచున్నది.

శ్రుతి:— శిష్య ఇతిచ "విద్యాధ్వస్తప్రపంచావగాహిత
జ్ఞానావశిష్టం బ్రహ్మైవ శిష్యః॥"

ఇట్టి యధికారియగు శిష్యుఁ డుపాసించవలసిన గురువుల స్వరూపమును శ్రుతి యిటుల దెలుపుచున్నది. ఇట్టి గురువు నుపాసింపవలయునని శాసించుచున్నది.

శ్రుతి:- ఉపాస్య ఇతిచ "సర్వశరీరస్థ చైతన్య బ్రహ్మప్రాపకో
గురు రుపాస్యః॥"

ఇట్టి గురుదేవుల నుపాసించుటవలనఁ గలుగు ఫలమెట్టి దియో యీ క్రింది శ్రుతివలనఁ దెలియనగుచున్నది.

శ్రుతి :- గురురేవ పరంబ్రహ్మ - గురురేవ పరాగతిః।
గురురేవ పరా విద్యా - గురురేవ పరాయణం॥

గురురేవ పరాకాష్ఠా - గురురేవ పరంధనం।
యస్మాత్ తదుపదేష్టాసౌ_తస్మాద్ గురుతరో గురుః॥

ఇతియః సకృదుచ్చారయతి-తస్యసంసార మోచనంభవతి॥
సర్వజన్మకృతంపాపం - తత్ క్షణాదేవ నశ్యతి॥
సర్వాన్ కామానవాప్నోతి-సర్వపురుషార్థసిద్ధిర్భవతి॥
య ఏవం వేదేత్యుపనిషత్॥

ఓం గుం శ్రీశ్రీయానందనాథేభ్యః స్వగురుభ్యోనమః స్వయంప్రకాశమును, పరమాత్మప్రత్యగాత్మాఖండ స్వరూపమును, స్వరూపనిరూపణ హేతుకమును, ప్రాసాదపరాపరాప్రాసాదాఖండ శాక్తాద్వైతబ్రహ్మార్థ భావనాత్మక శ్రీ గురు శ్రీ పాదుకా మహామంత్రార్థ లక్ష్యార్థము నగు శ్రీశ్రీశ్రీ శ్రీయానందనాథ తద్వతీపరాంబా దివ్యశ్రీమణి పాదుకాద్వయాఖండ సర్వ స్వరూపమునకుఁ దాదాత్మ్యభావనతో నమస్కరించి అనన్యభక్తితో "నేనెవరు?" అను గ్రంథమును సమర్పించుచున్నాను. గ్రంథమును పరిగ్రహించి శ్రీ గురుదేవులు ప్రసన్నులగుదురు గాత.

తే గీ. పూర్ణదీక్షాప్రదాత సంపూర్ణశాక్త
తత్త్వభావత్రయాత్త తాదాత్మ్యభావ
హృష్టహృదయుఁడు యోగినీహృదయమూర్తి
శ్రీ శ్రీఝానందనాథతత్త్వాశ్రయుండు
నైన గురునకే యీగ్రంథ మఙ్కితమ్ము.

శిష్యుఁడు

శ్రీ పరానందనాథుఁడు.

—*—

ఓం నమః

# నే నె వ రు ?

## ఉ ప క్ర మ ణి క

**అసత్, అవిద్యా, నిర్గుణ, సద్, విద్యా, సగుణ నిర్ణయము.**

**విద్యాఽవిద్యలు : మృత్యుతరణము — అమృతత్వము.**

శ్రుతి:- స ఏవ సర్వం యద్భూతం యచ్చ భవ్యం సనాతనం।
జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి నాన్యః పంథా విముక్తయే॥

మృత్యువును దరించుటకు దాని తత్త్వము నెఱింగి యనుభూతి నొందవలయును. అది యెద్ది? అదియే యవిద్య యనెడి యొక విద్య. అదే తత్పదార్థలక్ష్యము. విద్యలు రెం . . శ్రుతి:- "ద్వే విద్యే వేదితవ్యే." అవే పరబ్రహ్మ శబ్దబ్రహ్మ విద్యలు, పరాపరవిద్యలు నని సంజ్ఞితములు. అవియే విద్యా విద్యలనియు ననఁబ . ను. మృత్యువును దరించుట యవిద్యా జ్ఞానోపాసనము వలననే సాధ్యము. శ్రుతి:- 'అవిద్యయా మృత్యుం తీర్త్వా' పరము - అపరము నని బ్రహ్మము తత్త్వార్థ బోధము కొఱకు రెండు విధములుగ నెఱుంగఁబడుచున్నది. నామరూపభేదోపాధ్యాది విశిష్ట మపరము. తద్వివర్జితము పరము. వివర్జితమనఁగా ప్రవిలాపితమని యావదర్థము. వర్జిత మని కాదు. పరభావము జ్ఞేయము. పరము జగత్తున కధిష్ఠానము. అపరము ఉపాస్యము. దృశ్యమానమగుచున్న దంతయు నదియే. అది యధ్యస్తము. అధ్యస్తమనుట సాధకుని లక్ష్యమందు మాత్రమే. పరము జ్ఞేయభావమే యని యనుభూతి నొందుటతో ముక్తి సిద్ధించుచున్నది. అవిద్యవలన మృత్యు

వును దరించుటనఁగా, అవిద్యాజ్ఞానప్రాప్తియనెడి యమృతత్వభావసిద్ధియే విద్య. మృత్యుతరణమే యమృతత్వభావము. సమాహారైకభావము బ్రహ్మము. అందుఁ బరాపర విభేదాభాసమునకు సిద్ధిలేదు. శ్రుతి:- "బ్రహ్మైవేదం - విశ్వమిదం వరిష్ఠమ్." — ముండక. 2 - 211

"ద్వేవిద్యే వేదితవ్యే" యనుటవలనఁ బరాపరములు రెండును విద్యాసంజ్ఞితములే. అందు పరావిద్య —

అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః ।
పురాణం ధర్మశాస్త్రంచ విద్యాహ్యేతా శ్చతుర్దశ ॥

అనఁబడిన పదునాలుగువిద్యల స్వరూపముగ నెన్నిరి. పరవిద్యవలన నివృత్తిధర్మమును అపరవిద్యవలనఁ బ్రవృత్తిధర్మమును సామాన్యసాధకుల నుద్దేశించి బోధింపఁబడినవి. పూర్ణజిజ్ఞాసయందుఁ బరాపరముల అఖండాద్వైతసిద్ధి. అపరవిద్య నవిద్యయనియు నందురు. పరవిద్యాజ్ఞానాంగత్వమువలన నపరవిద్యను సమన్వయించుకొనుటవలనఁ గలుగు ఫలమే మృత్యుతరణమను నమృతత్వము. స్వసంకుచిత జ్ఞానమే మృత్యువు. అపరవిద్య పరవిద్యాసాధనాంగ మగుటవలన నేతద్ద్వయసమన్వయఫలప్రాప్తియే యమృతత్వప్రాప్తి. కావున నే

శ్రుతి:- 1. సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి॥
2. ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబిభేతి కుతశ్చన
3. తస్మాచ్చేన్న ప్రమాద్యతి
4. తమేకం జానథా ఆత్మాన మన్యా వాచో విముంచథా,
మృతస్యైష సేతుః॥

అని తైత్తిరీయ ముండక శ్రుతులు ఈవిద్యాద్వయసమన్వయము వలనఁ గలుగు ననుభూతిరూపమగు నర్థమును వచించుచున్నవి.

కారణకార్యవివక్షయందు బ్రహ్మాండము కారణము. పిండాండము కార్యము. ఏకత్వము కారణము. అనేకత్వము కార్యము. శ్రుతి:- "ఏకైవ సర్వత్ర వర్తతే తస్మాదుచ్యత ఏకా। ఏకైవ విశ్వరూపిణీ తస్మాదుచ్యతేఽనైకా॥" సాంఖ్యము కార్యము, యోగము కారణము. కావుననే పాతంజలమును సాంఖ్యప్రవచనయోగదర్శన మనిరి. కారణము పరోక్షజ్ఞానము. కార్యము అపరోక్షజ్ఞానము. కార్యమువలనఁ గారణ మెఱుంగఁబడును. కార్యానుమేయము కారణము. కారణము బ్రహ్మము. బ్రహ్మము కార్యానుమేయము. "కార్యానుమేయా సుధియైవ మాయా యయా జగత్ సర్వమిదం ప్రసూయతే" అని శ్రీభగవత్పాదులు. శ్రుతి:- "యతో వా ఇమాని భూతాని జాయంతే తద్బ్రహ్మ." శ్రుతి:- "అహం సువే పితరమస్య" అస్మచ్ఛబ్దగోచర మగునది బ్రహ్మమని యును శ్రీభగవత్పాదులు. కనుక మహామాయయే బ్రహ్మమని నిర్ధారణము. అదియే సర్వవేదాంతసిద్ధాంతసారము. ఆమహామాయయే యుపాస్యమగు చిదాకాశభావము. "మాతృత్వం యాతీతి మాయా" అని మాతృశబ్దార్థ నిర్వచనము.

శ్లో॥ శుద్ధం బుద్ధం తత్త్వసిద్ధం పరం ప్రత్యగఖండితం।
స్వప్రకాశం పరాకాశం బ్రహ్మైవాస్మీతి భావయేత్॥

— శ్రీభగవత్పాదులు

మాయాకార్యము జగత్తు. జగత్తునకుఁ గారణము మాయ. అందుచే నది సుసూక్ష్మమగు కారణభావము. అదియే బ్రహ్మశక్తి. బ్రహ్మము.

శ్లో॥ సుసూక్ష్మమ స్తితామాత్రం నిర్వికల్పం మహత్తమం।
కేవలం పరమాద్వైతం బ్రహ్మైవాస్మీతి భావయేత్॥

— శ్రీభగవత్పాదులు

మహత్తను మనుటచే నిచ్చానిష్ఠమగు సమాహారైక భావమే బ్రహ్మమని యెఱుఁగనది మాయాశక్తి కార్యమును 'నేతినేతి' వాక్యములచే విమర్శించుచుఁ గారణభావమగు శక్తి నెఱుంగవలెననుట సాధనపాదము. న ఇతి = నేతి. అనఁగా లేదనునర్థము కాదు. 'న' యను నిషేధమువలన నిషేధిత పదార్థము బ్రహ్మభావాంతర్గతమే. కాని తదన్యము కాదని యెఱుఁగుటే లక్ష్యము.

సాధకున కుపలబ్ధముకాని భావమును విమర్శించుట యందే లక్ష్యముండును. శ్రుతి:- "యస్యా గ్రహణం నోప లభ్యతే తస్మాదుచ్యతే లక్ష్యా" లక్ష్యసిద్ధ్యనంతరము స్వరూప స్థితియే నిల్చియుండునది. నేతి నేతివాక్యములందు నిషేధింపఁ బడునది భిన్నమగు ద్వైతభావముమాత్రమే. నానాత్వభావము నేకత్వభావమందుఁ బ్రవిలాప మొనర్చుటే నేతినేతి వాక్య లక్ష్యము.

శ్లో॥ ఏతద్దృశ్యం నామరూపాత్మకం
యోఽధిష్ఠానం తద్బ్రహ్మ సత్యం సదేతి ।
గచ్ఛంస్తిష్ఠన్ వా శయానోఽపి నిత్యం
కుర్యాద్విద్వాన్ బాహ్యశబ్దాను విద్ధమ్॥
అధ్యస్తనామరూపాదిప్రవిలాపేన నిర్మలం।
అద్వైతం పరమానందం బ్రహ్మైవాస్మీతి భావయేత్॥
— శ్రీ భగవత్పాదులు

శ్రుతి:- సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని।
సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా॥
— కై. రు.

ఇచట 'తద్బ్రహ్మ' యనఁగా తత్పదార్థమగు బ్రహ్మ మని యర్థము. శ్రుతి:- "సత్యం జ్ఞానమనంతమానందం సర్వ

జ్ఞత్వాద్యుపేతం మాయోపాధికం తత్పదార్థః పరమాత్మా॥” త్వమ్ పదార్థమగు సాధకు నుద్దేశించి యీ శ్లోకము చెప్పఁబడినది. శ్రుతి:- “యదవభాసతే తదవిద్యోపాధికం, త్వమ్ పదార్థస్స ప్రత్యగాత్మా॥” త్వమ్పదార్థలక్ష్యమగు నీవే అహం పదార్థము. కావున నీవే త్వమ్పదార్థమును; నిన్ను నీవెఱిఁగినఁ దరింతువు, ముక్తుడవగుదువు. (అవిద్యయా మృత్యుం తీర్త్వా)

ఇఁక ‘త్వం’ పదార్థోపాసనమును వినుము. శ్రుతిః - “త్వంపద మహామంత్రస్య పరమాత్మా దేవతా, ఐం బీజమ్, క్లీం శక్తిః సౌః కీలకం, ముక్త్యర్థే జపే వినియోగః” దీనినే మంత్రమాతాతు త్ర్యక్షరీ అనిరి. ఈమహామంత్రమే సృష్ట్యున్ముఖీ విద్యయందు సహస్రారమునఁ గవచముగ న్యసింపఁబడుచున్నది. తత్త్వసిద్ధ్యనంతరము తత్పదార్థము లోపించి, బ్రహ్మభావముగ త్వమ్ పదార్థమే సద్భావమున భాసించుచుండును. అనఁగా తత్పదార్థమునందుఁ దత్త్వార్థబోధనమునకై శ్రుతి దర్శించుచున్న లక్షణములు, త్వమ్ పదార్థమందుఁ బ్రవిలాపితములగును; దృశ్యమానము లగును; సిద్ధించును. అందువల్లనే శ్రుతి తత్పదార్థమును దత్త్వసిద్ధికాలమున నిషేధించుచున్నది.

శ్రుతి:- “న తదస్తి, న యత్రాహాం, న తదస్తి న తన్మయం” కావున సర్వభావము మహామాయయే. త్వమ్పదార్థమే సర్వమును దాన యగుచున్నది. “Mass is simply concentrated energy” అని యాధునిక ప్రపంచవిజ్ఞానవేత్తలలో నగ్రగణ్యుఁడగు డాక్టర్ ఐన్స్టన్. అనఁగాఁ దత్పదార్థసారాంశమే త్వమ్ పదార్థమని యావదర్థము. బ్రహ్మభావసారాంశమే బ్రహ్మ

మూలప్రకృతి. పురుషప్రకృతియొక్క యంతరంగమే మూల ప్రకృతియొక్క బహిరంగము. కారణకార్యభావాఖండస్వరూప మగు మూలప్రకృతియనెడి మహామాయయగు దేవి 'అజానజా' భావమగుటవలన నంతకంటెం బరమగు తత్త్వమునకు సిద్ధిలేదు. సర్వభావ మా మూలప్రకృతియే. జగద్గురు పదవీ విరాజితు లగు నాధునికమాంతాచార్యులునుం దమ శ్రీవిద్యా ప్రమాణ సూత్రములందు "తద్వివేకేన చ వస్తుస్వరూపావధారణం విద్యా" అనిరి సర్వవేదసారాంశము 'అయమాత్మా బ్రహ్మ' అనియే కదా.

శ్రుతి:- జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే।
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే॥

శ్రుతి:- తత్ త్వమేవ, త్వమేవ తత్. —శతరుద్రీయము.

తత్ త్వమ్ పదార్థముల కద్వైతసిద్ధి కలుగగా సమా హారైకభావమున బ్రహ్మము భాసించుచుండును. అట్టి భావ మును అధర్వవేద మిట్లుపదేశించుచున్నది.

శ్రుతి:- వియదీకారసంయుక్తం వీతిహోత్రసమన్వితమ్
అర్థేందులసితం దేవ్యా బీజం సర్వార్థసాధకమ్।
ఏవమేకాక్షరం మంత్రం యతయః శుద్ధచేతసః
ధ్యాయంతి పరమానంద మయా జ్ఞానాంబురాశయః॥

శ్రీ విద్యారణ్యమునీంద్రులు దీనినే యుపాసించిరని తెలియు చున్నది. శ్రీ శంకరులు ధ్యానించిన దిదియే. తారమును (ఓం) మాయయును (హ్రీం) అఖండభావమునం బ్రకార త్రయాత్మకాద్వైత బ్రహ్మభావమును దర్శించుచున్నవి.

కావుననే త్రైపురసిద్ధి. ప్రణవ మాత్మభావము మాయ సంసారభావము. ప్రణవమాయ మహామాయ. అదియే బ్రహ్మము. సంసారజ్ఞానమువలన నాత్మ యెఱుంగఁబడును. ఆత్మజ్ఞానమువలన సంసరణసిద్ధి కలుగును. ఆ రెండును నవినాభావ సంబద్ధములు. శ్రుతి:-'ఏషర్గ్యజుః పర, మేతచ్చ సామా, యమథర్వేయ మన్యా చ విద్యా ఓం హ్రీం - ఓం హ్రీం' అని, శ్రుతి:- "సదేవ సౌమ్య దమగ్ర ఆసీత్" అని యుపక్రమించి "ఏతదాత్మ్యం" అని యుపసంహరించుటతో సర్వమును సద్భావమే. సద్భావరూపముననే దాని నుపాసింపవలయును, పొందవలయునని గ్రహించునది. శ్రుతి:- "యదిదం కించ తత్సత్యం" అనిగదా. శ్రుతి:- "ఏకమేవా ద్వితీయంబ్రహ్మ" అనుటలోని యద్వితీయప్రతిపాదనము జగత్తుకుఁగూడ బ్రహ్మ సత్యభావమే యని యుపదేశించుటే తాత్పర్యమై యున్నది. బ్రహ్మమో సదసద్భావపూర్ణము, ద్వైతాద్వైతపూర్ణము, పూర్ణము. శ్రుతి:- "ఏకం బ్రహ్మ ద్వయం బ్రహ్మ మోహో బ్రహ్మ శమాదికం । దోషో బ్రహ్మ గుణో బ్రహ్మ". ఇఁక జగత్తు బ్రహ్మ, సత్యము. బ్రహ్మము. అసద్భావమునందుఁ గారణము. సద్భావమునందుఁ గార్యము; కారణకార్యముల కద్వైతసిద్ధియును నభిన్నత్వమును స్వతస్సిద్ధమగుట సత్యము. కావున బ్రహ్మము సదసద్భావపూర్ణము. శ్రుతి:- "సమస్త సాక్ష్యం సదసద్విహీనం ప్రయాతి శుద్ధం పరమాత్మరూపమ్" అని శతరుద్రీయ ముపసంహరింపఁబడినది. "త్వంపద మహా మంత్రస్య పరమాత్మా దేవతా"అని కఠా శ్రుతి. సదసద్వి హీనమనుటవలన సదసద్భేదహీనము అని అర్థము. అందువలన సత్తునకును అసత్తునకును అఖండాద్వైతసిద్ధి కలిగినది. పర

మాత్రరూపము సదసద్భిన్నము గాక, సదసద్విహీనమనుటవలన సదసదఖండాద్వైతభావపూర్ణ మని సిద్ధించుచున్నది.

శ్రుతి:- "అసద్వా ఇదమగ్ర ఆసీత్ । తతో వై సదజాయత।" ఆసీత్ శబ్దార్థమును విమర్శించుచు మహర్షులిట్లు వచించిరి. "ఆసీదిత్యేషః అనిశ్చయరూపః భూతకాలికోఽభావరూపః" ద్వైతసృష్టియందు వర్తమానకాలమున అభావమగు దానిని అభావరూపమనిరి. అదియే భూతకాలము. "అసత్" అను శబ్దము భూతకాలార్థప్రతిపాదకము మాత్రమే. ఇప్పుడు లేనిదే యసత్. ఇపుడున్నదే సత్తు. భిన్నదృష్టి గల సాధక జిజ్ఞాసువుల నుద్దేశించి "భూతకాలమందుండినదియే యిపుడును నున్నది." అను నర్థమును బోధించుటకై "అసద్వా ఇదమగ్ర ఆసీత్ । తతో వై సదజాయత" అని శ్రుతి ప్రవర్తించుచున్నది. ఇంకను స్థూలముగ విమర్శింతము. భూతకాలమున నిది అసత్తు. ఇదియే వర్తమానకాలమున సత్తు. చిత్రమేమనఁగా సాధకుని తరువాతఁ బదునొకండవతరము వానికిఁ సాధకున కేది సత్తో అదియే అసత్తు కాఁగలదు. భూతకాలమిప్పుడు లేదు. కావున నది యసత్తు. వర్తమానకాలమిప్పుడు కలదు. కావున సత్తు. పూర్ణజిజ్ఞాసయందు ఇంతకు మున్నేది యసత్తో అదియే యిపుడు సత్తు. ఇవి సంజ్ఞలు మాత్రమే. "స్వరూపేణావస్థితైవ హి సంజ్ఞా" "అరూపాణాం సంజ్ఞా నిరర్థా భవతి" అని మహర్షులు కావున నిది కేవలము సత్తునుం గాదు, అసత్తునుం గాదు. కావుననే సదసద్విహీన మనఁబడినది. కనుక నే సదసద్భావపూర్ణము. పూర్ణమని సిద్ధాంతము.

"భూతకాలికోఽభావ రూపః" అను విమర్శవలన సగుణ నిర్గుణవిమర్శనమును గలదు. భూతకాలికము నిర్గుణము. వర్త

మాన కాలికము సగుణము. అసత్పదమందు అకారము బీజము.

శ్రుతి:- "బీజశక్తీ న్యసేద్దక్షవామయోః స్తనయోరపి॥
కీలోమధ్యేఽవినాభావ్యః స్వవాంఛా వినియోగవాన్"

అకార ఇకార ఉకారములు మూలములగు బీజశక్తి కీలకములు. అకారాంతరంగము ఇకారము. అసత్ శబ్దార్థము అకారబీజోద్భూతము. కావున నే శక్తిపేరు మహామాయ యును, ఉపాస్యము, అవిద్యయు నైనవి. "ఏర్ణైశ్చ పునశ్శబ్దా జాయంతే వర్ణక్రమవిధానాచ్చ శబ్దార్థఃప్రతీయతే"అని మహర్షులు. "అకారో బ్రహ్మరూపస్యా న్నిర్గుణః సర్వవస్తుషు" అని నందికేశ్వరశికాశ. కావున సత్పదార్థకారణభావమగు నిర్గుణ బ్రహ్మభావమే అసత్పదార్థమని నిర్ణయము. తత్త్వవిమర్శని యందు "అసద్వా ఇదమగ్ర ఆసీత్ తతో వై సదజాయత" ఇతి. శ్రుతి:-"అసద్బ్రహ్మ వై నిశ్చయేన, అగ్రే సృష్టేః పూర్వ మిదమక్షరాత్మకమాసీత్। తతోఽక్షరాత్ అసతో వై సత్ సగుణమజాయత జాతమిత్యర్థః" తదుక్తంగీతాయాం "అక్షరాణా మకారోఽస్మీతి"అని విమర్శింపఁబడియున్నది. ఇందుఁ గలదియే విస్మరణ స్మరణ భేదము. ఈ రెండును బూర్వాద్యతనకాలవచనముచేత సంబద్ధములు. పూర్వాద్యతనము లకనుపస్థితి. ఇప్పుడుండుచున్నదే వెనుకనుం గలదనుట సత్యము కావున నిది కేవలమిపుడు మాత్రమే యుండుచు వెనుక లేద నుటకు వీలులేదు. ఇది కాలము.

చైతన్యస్వరూప బ్రహ్మశక్తియే బ్రహ్మసత్తకుఁ గారణ మని, కారణకార్యభావవిమర్శయందు నిర్ణయము. ఇతఃపరము నకు ఖండభావమున సిద్ధి లేదు. సర్వదా సాధకుఁడు వర్తమాన

కాలమందున్నవాఁడగుటచే, భూతకాలికమును, కారణభావకల్పితమును నగు అసద్భావమును నిషేధించుకొనుచు, వర్తమానకాలికమును, కార్యభావకల్పితమును నగు సద్భావమునే గ్రహించుచున్నాఁడు. ఇది కేవల సాధనపాదమందుమాత్రమే. అవిద్యాశబ్దార్థమునుసైత మిట్లే సమన్వయించుకొనవలయును. వర్తమానము కార్యభావమునఁ గల్పితము. కారణకార్యాఖండాద్వైతసిద్ధియందుఁ గల్పితభావప్రసక్తికి సిద్ధిలేదు. సర్వమును వర్తమానమే యగుటవలన సద్భావమునే బ్రహ్మముగా గ్రహించుట యద్వైతాచార్యుల యభీష్టము. అవిద్యావిద్యలకును నిట్టి సమన్వయమునే సాధించుకొనునది. వానికిఁగల సంబంధము అంతరంగమునకును బహిరంగమునకును, హృదయమునకును కవచమునకును గల యట్టిదియే.

కాలము ఆద్యమగు తత్త్వము. అందువలన నిది సర్వత్ర సర్వదా కలదు. కాలత్రయ విభిన్నదృష్టియందు ఆద్యమగు కాలమే తత్త్వసిద్ధ్యనంతరము త్రికాలములందును గలదు. త్రికాలములందు నొకటియే యుండుచుండుటవలనఁ త్రికాల ప్రత్యేకతకు సిద్ధి లేదు. కాలమఖండముగాన నది సార్వకాలికము. అందువల్లనే తత్త్వసిద్ధ్యనంతరమున నది, యనాదియు ననంతమునై భాసించుచున్నది. శ్రుతి:- "స ఏవ సర్వం యద్భూతం యచ్చ భవ్యం సనాతనం జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి" (శతరుద్రీయము). బ్రహ్మ సత్యం జగన్మిథ్యాది పదములు తత్త్వార్థబోధకొఱకుఁ గల్పితములు. తత్త్వసిద్ధ్యనంతరము మౌనమే సర్వదా శరణ్యము. "తత్సదాహమితి మౌనమాశ్రయ" అని శ్రుతి॥

హ్రీం నమః.

## బ్రహ్మ సత్యం జగన్మిథ్యాతాత్పర్యము.

మిథ్యాతత్త్వమును మహర్షులిట్లు విమర్శించిరి. "పృథివ్యప్తేజోవాయ్వాకాశదిక్కాలసంఖ్యాపరిమాణాని చ సావసానారంభాణి చేతి బోద్ధవ్యమ్॥ ఆత్మా తు స్వయమనాద్యనంతః। అవసానార్థకోఽయమారంభో భవతి। తథా చావసానమస్యారంభార్థకం భవతీత్యేతత్సంబంధోఽపి పరస్పరఫలో భవతి। ఆద్యంతవిశిష్టోఽనాద్యనంతవస్తుబోధకశ్చ భవతి॥ అత్రైవ ప్రకృతిశక్తిశ్చ తిష్ఠతి। సంఖ్యాకాలశబ్దాదీనాం సంభవశ్చ తదధీన ఏవ పరిదృశ్యతే। ఏతైరేవహి చాణుత్వమహత్త్వే తేషాం సంసర్గశ్చ భవతి। తతస్సర్వాధారభూతే యమిత్యవగమ్యతే। తత్రచైకః ప్రేరకతయాఽద్వితీయో భవతి। తత్రచైకో వినశ్యతీతి (ప్రలీయతీతి) నియమేన సర్వోపి పరస్పరం సర్వోత్పాదకాః సర్వవినాశకాశ్చ వ్యవస్థితా భవన్తి। అస్య మిథ్యాత్వమప్యవగమ్యతే। యస్య చ భేదో విభావ్యతే నోత్పాదకపినాశకవిధిః। ఏవ్యస్థం తదేవ మిథ్యేతి ప్రతీతేః। అత్రైవ యుష్మదస్మదా తమఃప్రకాశౌ చ దృశ్యేతే। కేవలమిథ్యాత్వమప్యస్య లక్షణం భవతి। అన్యథా తు యుష్మదస్మద్వృత్తేరేకత్వేన భేదో న స్యాత్। అత ఏవ మిథ్యాప్రపంచాత్మకం సర్వం భవతి॥

ఈ విమర్శమందలి సారాంశమును గ్రహించిన మిథ్యాతత్త్వము తెలియవచ్చును. జగత్తుయొక్క లక్షణమును బోధించునదే మిథ్యాశబ్దము. నాస్తిత్వార్థక మెంతమాత్రమును గాదు. జగద్బ్రహ్మమిథ్యాసత్యాదిసంజ్ఞలు తత్త్వబోధార్థము కల్పితములు. సర్వమును చైతన్యస్వరూపమగు శక్తిభావమే.

తత్త్వసిద్ధ్యనంతరము తదన్యమునకు సిద్ధి లేదనెడి తెలివియే భాసించును. దానసే సర్వమును భాసించుచుండును. మిథ్య యనునదియు నొకసంజ్ఞయే; అటులే బ్రహ్మ యనునదియు నొక సంజ్ఞయే; సర్వము నటులే "స్వరూపేణావస్థితస్యైవ హి సంజ్ఞా। అరూపాణాం చ సంజ్ఞా నిరర్థా భవతి।రూపప్రయుక్తా చ సంజ్ఞా, కేవలమింద్రియ గ్రాహ్యాణామేవేతి న, కింతు జ్ఞానగమ్యానా మపి। తద్వైజ్ఞానికానామపి చేతి బోధ్యమ్॥ అనియు ను, సతి చ సముద్రే బిందురిత్యేకే – సతి చ బిందౌ సముద్ర ఇత్యేకే పరిభావనయా చోభయో స్సత్తా త్వేకైవ భవతి। యయా చైతద్ద్వయోరుపస్థితిః సా సత్తా।సైవాత్మా న సముద్రో న చ బిందుః॥" అని యార్షనిర్ణయ వచనములు. అనఁగా రెండిటి కిని మూలమగు చైతన్యస్వరూపమే యాత్మ. బ్రహ్మజగత్తు లును, సత్యమిథ్యలును నఖండాద్వైతైకమగు భావమని సర్వ వేదాన్తవేద్యమగు తత్త్వము.

శ్రీం నమః

# శ్రీ మ ద్భా గ వ త ము

పృథివీజాతములగు నోషధులకుఁ బ్రత్యేకించి స్థితికాల మందు సిద్ధి, లయకాలమందసిద్ధి; కాని పృథివి కీసందర్భమున నిత్యత్వమే. ఓషధ్యాది స్థితి కాల పరిణామము మాత్రము గౌణము. "పృథివ్యా ఓషధయః, ఓషధిభ్యోఽన్నమ్, అన్నా త్పురుషః" అని శ్రుతులు. అటులే బ్రహ్మజగత్తులకుంగల సంబం ధము. జగత్తు పరిణామి యగుటచే ననిత్యమను వాదము తత్త్వార్థబోధకొఱకే. ఏలనఁగా, పరిణామగుణము కూడ

సార్వకాలికమే యగుచున్నది. గుణిగుణముల కద్వైతసిద్ధి. పరిణామి యనిత్యమను సిద్ధాన్తము నిత్యానిత్య వస్తువివేకో దయపర్యంతమగు సాధనము. ఫలప్రాప్తి తరువాత ఫలము నకుఁ గారణమగు పుష్పము రాలిపోవునట్లు, నిత్యానిత్య వస్తువిజ్ఞానము నిత్యానిత్యవస్తుజ్ఞానమునందు ప్రలీనమై పోవును. విభాసనము భాసనమునం దంతర్గతమై యుండును. సర్వైక్య జ్ఞానము వైదికము. సర్వనిష్ఠమగు భేదవిజ్ఞానము లౌకికము. "వైదికో జ్ఞాననిష్ఠః స్యాల్లౌకికశ్చ క్రియా పరా" అని ప్రవచ నము. "యేన యేన హి శబ్దేన సర్వస్యైక్యం హి బుధ్యతే। తం శబ్దం వైదికం విద్ధి జ్ఞాననిష్ఠమ్" అనియును, "ఏతన్నిష్ఠశ్చ యఃశబ్దో యేన భేదఃప్రభాసతే। తం శబ్దం లౌకికం విద్ధి సర్వ నిష్ఠమ్" అనియును ప్రవచనములు.

పరస్పరభిన్నధర్మములు భిన్నదృష్టియందు గోచరించు చున్న యగ్నిజలములలో అగ్నినుండి జల ముత్పన్నమగు నట్లును, అటులే జలమునుండి పృథివి యుత్పన్నమగునట్లును అసద్భావమునుండి సద్భావముత్పన్నమగుచున్నది. అసద్భావ మునుండి సద్భావమెటులు జనించునని ప్రశ్నించు పండితుల దృష్టియందు – తత్కాలమున సర్వమును సత్యమగు సద్భా వమే యగుననియుఁ, దదన్యమునకు సిద్ధి లేదనియు విశ్వా సము. అయినచో, సర్వమగు సద్భావమునందు జగత్తధ్యస్త మనియును, అందువలన నవిద్యాకార్యమనియు, అసత్తనియు భావించుట పొరపాటు కాదా? సత్తునుండి యసత్తెట్లుపుట్టునను వారి ప్రశ్నమునందలి సారాంశమునే విలోమక్రమమున వైచుకొన రాదా?

కాలమువలననే సర్వమునకును సిద్ధి. సర్వము బ్రహ్మభావము. ఎల్లప్పుడు నుండుటే దాని స్వభావము. ద్వైతదర్శన కార్యానంతరమే యద్వైత సిద్ధి. ద్వైత నిభాసమే యద్వైతమందలి సర్వసంబంధరూపము. ద్వైతభావమందు సంబంధరూపవంతమైనదే యద్వైతభావమని సారాంశము.

ద్వైతాద్వైతము బ్రహ్మము, గాన నది యిచ్ఛానిష్ఠము. ఋణాధనశక్తుల సమాహారమువలన విద్యుత్కాంతి రూపొందుచున్నట్లు, సదసద్భావైక సమాహారము వలన సత్యము ప్రతీయమానమగును. భిన్నదృష్టియందు "అసత్తో వై సదజాయత, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ" అనునట్టి కార్యధర్మమును వ్యతిక్రమధర్మమందురు. ఇట్టి తత్త్వమును సంఘటించుచున్న శక్తి యఘటనఘటనపటిష్ఠమని చెప్పఁబడినది. శక్తిశక్తిమంతుల కభిన్నాద్వైతసిద్ధి. ఇది వైదికదృష్టి. శక్తి యంతరంగము. శక్తిమంతుఁడు బహిరంగము. ఇది లౌకికదృష్టి. నైసర్గికప్రసవధర్మాత్మకమగునది బ్రహ్మము. అది శాక్తతత్త్వమునందలి సాధకదృష్టి. "ఆతతత్వాచ్చ మాతృత్వాదాత్మాపి పరమో హరిః" అని కొందఱనుచున్నారు. (శ్రీధరస్వామిధృతస్మృతి) అట్టి వారికి హరి యగు విష్ణువే పరమదైవము. కాన మాతృత్వధర్మము నాత్మయందంగీకరించుటకుఁ గారణము ప్రశస్తమైనది.

ఒక్కమాట. దేవతావాహనము తత్తద్దేవతాధిష్ఠితమగు భావమునకుఁ జిహ్నము. మూలదేవతా మిథునత్రయమును జూడుఁడు. బ్రహ్మ హంసవాహనుఁడు; విష్ణువు గరుడవాహనుఁడు; శివుఁడు వృషభవాహనుఁడు. వారా తత్త్వ

నిగూఢార్థముకంటె భిన్నులు కారను ప్రమాణమే వారి కేతనము. బ్రహ్మ హంసకేతనుఁడు. విష్ణువు గరుడధ్వజుఁడు. శివుఁడు వృషభధ్వజుఁడు. ఇఁక సరస్వతి హంసను, లక్ష్మి గరుత్మంతుని అనఁగా వారి భర్తల వాహనములనే యధిష్ఠింతుట. అనఁగా భార్యాభర్తల కొకటే వాహనము. విశేషమేమనఁగా – మహేశ్వరి సింహవాహన, మహేశ్వరునకు సింహము నెక్క సిద్ధిలేదు. అయినచో నంది నెక్కుటకు మహేశ్వరి కధికారమున్నదే; సింహము నెక్కుటకు మహేశ్వరుని కేల యధికారము లేదు? జిజ్ఞాసువు లాలోచింతురు గాక. అదే శాక్తాద్వైతము నందొక కీలకము. సింహము సంకేతము. అది పంచభూతమయము. పంచభూతాత్మకము శక్తి యపంచభూతాత్మిక. ఆమెనే శ్రుతులు "దేవి" యని ప్రస్తుతించినవి. పంచభూతాత్మకమగు సింహ సాంకేతిక భావము నధిష్ఠించుటకుఁ గ్రమముగఁ బంచభూతాధిపతులు మాత్రమే యగు సదాశివేశ్వరరుద్రవిష్ణుబ్రహ్మల కధికారము చాలదు. "అహం పంచభూతాన్యపంచభూతాని" అని దేవ్యుపనిషత్తు. ఆమెయే యందఱుఁ గన్నతల్లి. అమ్మ. బహుభవనసంకల్పలోకజననియును, లక్ష్మీ సరస్వతీ పార్వతీ రూపమునఁ బ్రసిద్ధయు నగు సర్వాతీతపరబ్రహ్మశక్తియే. బ్రహ్మభావసమాహారాఖ్యమగు నైక్యవిజ్ఞానమునకు మూలమగు సంసారమును సృజించుచున్నది. జ్ఞానేచ్ఛాక్రియాసమాహారమగు నమ్మహాశక్తియందే సంసారమును, సనాతనమగు ప్రణవమును, మాయయు నున్నవి. ప్రణవమాయాత్మకమగు నా మహాశక్తినే బ్రహ్మభావమున సంసారులును, ముముక్షువులును బరమహంసలును మహావాక్యార్థవిజ్ఞానముతో నుపాసించుచున్నారు. ప్రణవ

షష్టమరసము. పదునారు మహావాక్యములలో నష్టమ మహా వాక్యము. ప్రణవాదితత్వప్రతిపాదకమే; యనఁగా సర్వతత్త్వ ప్రతిపాదకము. "సర్వం బ్రహ్మేతి వాక్యంతు చాష్టమం పరికథ్యతే॥" అని యుపదేశము. అష్టమసంఖ్యా సమరసాత్మకము శక్తియే. "యత్ర వస్తు సమస్తం చ భాతి సర్వనిరంతరం। తద్వస్తు పరమార్థం స్యాత్ సమాహారపరం భవేత్॥"

— ప్రణవార్ణవము

మహావాక్యములు వేదచతుష్టయమునుండి యొక్కొక్కటిగా నుద్ధరింపఁబడినవి నాలుగు. షోడశీశ్రీవిద్యయందు నాలుగు ఖండములు. పూర్ణ మహావాక్యములు పదునారు. షోడశీయం దక్షరములు పదునారు. చంద్రకళలు పదునారు, విద్యలు పదునారు. సర్వమును నిత్యామయమగుట నిత్యము.

"ఆత్మజ్ఞానవిధురాః కేవల సంసారకర్మ చికీర్షవశ్చాసురాః। యే తు పునర్వినా సంసారధర్మవిజ్ఞాన మాత్మజిజ్ఞాసాయాం ప్రవర్తంతే, తేఽపి మహాసురా ఏవ। యే తూభయమపి జానన్తి త ఏవ దేవాః॥" (ఖండరహస్యము) కావున నే దేవతలు కేవలాముష్మికఫలప్రదాతలేగాక, ఐహికాముష్మిక ఫలప్రదాతలునై యున్నారు.

సంధివలన సర్వోత్పత్తి – సంసారమే జీవాత్మ పరమాత్మలకు సంధిస్థానమని శ్రుతినిశ్చితము. సంసారమువలన నాత్మబోధ కలుగును. సంసారస్థితికి హేతువాత్మ – ఆత్మ లేనిదే సంసారమునకును, సంసారము లేనిదే యాత్మకును సిద్ధి లేదు. మనమందఱమును బహిరంగముగ సంసారము. అందుచే మన కాత్మ ప్రధానము. అంతరంగజిజ్ఞాసయే యాత్మజిజ్ఞాస.

మిథ్యాత్వమున నాత్మప్రతీతి కలుగుచున్నను, ఆత్మసంసరణా వశ్యకత్వమున సంసరణ మాత్మకార్యమగుచున్నది. అందుచే సంసారత్యాగ మసంభవము. లౌకికత్యాగము సాధనాంగ మగు భ్రమమాత్రమే. త్యాగమసంభవమై, ద్వైతభావోత్పాదకగుణధర్మభూయిష్ఠమై యుండు దానిని మిథ్య యందురు. మిథ్యాపదమును నొక సంజ్ఞయే.

ఇఁక నుపాసనమును విమర్శింతము. శ్రుతి:- "త్రిపురాభిధా భగవతీత్యేవ మాదిశక్త్యా భూర్భువస్త్రీణి, స్వర్గభూపాతాలాని, త్రిపురాణి। హరమాయాత్మకేన హ్రీంకారేణ హృల్లేఖాఖ్యా భగవతీ త్రికూటావసానే, నిలయే, విలయే, ధామ్ని, మహసా ఘోరేణ వ్యాప్నోతి । సైవేయం భగవతీ త్రిపురేణ వ్యాపద్యతే, తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్, పరో రజసి సావదోమ్ ॥ ఆద్యాని చత్వారి పదాని పరబ్రహ్మవికాసీనీతి।" దీనిచేఁ జతుర్వింశత్యక్షర యగు బ్రహ్మగాయత్రి విమర్శింపఁబడినది. ఇటులు షోడశీపరిణామమే బ్రహ్మగాయత్రిగా రూపొందినది.

శ్రీమద్వేదవ్యాసులు భాగవతము నీక్రింది శ్లోకముతో నుపక్రమించి యాతరువాత నుల్లేఖింపఁబడిన శ్లోకముతో నుపసంహరించిరి.

శ్లో॥ జన్మాద్యస్య యతోఽన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మహృదా య ఆదికవయే ముహ్యన్తి యత్సూరయః।
తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గోఽమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి॥

— భా॥ ౧. ౧. ౧.

శ్లో॥ ప్రచ్ఛిద్య విపులం విశోకమమృతం సత్యం పరం ధీమహి॥
— భా॥ ౧౨. ౧౩. ౧౯

శ్రీమద్భాగవతమున కద్వైతవ్యాఖ్యాతారులగు శ్రీధరాచార్యులు, ఆద్యశ్లోక వ్యాఖ్యానమందు "గాయత్ర్యాఖ్యా బ్రహ్మవిద్యేయమితి దర్శయతి" అనియును విమర్శించిరి. బ్రహ్మగాయత్రీసారాంశమే షోడశి యనుట శ్రుతి సిద్ధము.

"జన్మాద్యస్య యతః" అనుట యందలి లక్ష్యము "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" యనెడి శ్రుతి జిజ్ఞాసాకారణత్వరూపమున నే (సృష్టి స్థితి లయ) భేదభావమున జగత్తు స్ఫుటఫలముగఁ దైత్తిరీయమందు దర్శింపఁబడినది. అది కర్మనిష్ఠమగు యజుర్వేదాన్తర్గతము. రూపభేదమును, సంజ్ఞాభేదమును, జగద్భేదభావమునందలి పరస్పరసంబంధమువలనఁ గలుగుచున్నవి. అట్టి సంబంధము కూడ, కాలస్వరూప భేదభావమువలనఁ గలుగుచున్నందునఁ బృథక్త్వసిద్ధి. కాలసంఖ్యానియమమున నవస్థాభేదసిద్ధి. అందు వల్లనే సర్వవ్యాపార సిద్ధి.

శ్రుతి:– (1) తేషాం పంచభూతానాం పతయః పంచ-సదాశివేశ్వరరుద్రవిష్ణుబ్రహ్మాణశ్చేతి॥ (2) తేషాం బ్రహ్మవిష్ణురుద్రాశ్చోత్పత్తిస్థితిలయకర్తారః॥ (3) రాజసో బ్రహ్మా, సాత్త్వికో విష్ణుః, తామసో రుద్రః। ఇత్యేతే త్రయో గుణయుక్తాః॥ (4) అజామేకాం లోహిత శుక్లకృష్ణామ్॥ ఇతి. "తేజోవారిమృదామ్" అను శ్రీమద్భాగవతోపక్రమణ శ్లోకాంతర్గత పదత్రయ విమర్శనమునకుఁ బై శ్రుతులను సమన్వయించుకొనవలయును. త్రితయాత్మక సర్వసత్తను

శక్తి యగు దేవియే కారణము. జలభూతాధిపతి విష్ణువు. జలగుణములందు ముఖ్యమైనది రసగుణము. విష్ణుభాగవతమునందందువలన రసభావమగు రాసక్రీడ వర్ణింపఁబడినది. "రసో వై సః" అను శ్రుతివలన రసము పరమాత్మగా దర్శింపఁబడినది. పంచభూతాత్మకమైన యేకభావము ఆత్మ. అందువలన నందుండి భూతపంచకమును జనించెను. పంచభూతగుణముల సమాహారైక బహిరంగభావము జగద్రూపమగు పృథ్వి; కావున "శబ్దస్పర్శరూపరసగంధాః పృథివీగుణాః" అని శ్రుతి చూపినది. అందువలననే షట్చక్రములందును మూలాధారమునకుఁ బ్రాధాన్యము.

శ్లో॥ నిగమకల్పతరోర్గలితం ఫలం। శుకముఖాదమృతద్రవసంయుతమ్।
పిబ భాగవతం రసమాలయం ముహురహో రసికా భువి భావుకాః॥

—శ్రీ. భా. ౧-౧-3

"రసమాలయం" – "అమృతద్రవ సమ్మితమ్" అను ప్రయోగములందు నిగూఢార్థము కలదు. "శుకముఖాత్" అనుటవలన శుకమహర్షి గ్రహించిన రసస్వరూప మిదియే యనియు, తాననుభవించి లోకమున కిచ్చినది యిదియే యనియు భావము. అది యొక్కసారిమాత్రమే త్రాగి విడువఁదగినది గాదు. 'ఆలయమ్' శరీరపాతపర్యంతము నాస్వాదింపవలసినదే యనియు భావము. "నిగమకల్పతరోర్గలితమ్" అనుచో తచ్ఛబ్దమందును నిగూఢ భావము కలదు. వేదసారఫలమే భాగవతమని తెలియును. "ఫలమ్" అనుటవలన జగద్భావమగు (పృథివి) మూలాధారశక్తివిలాసమనియును దెలియును. ఫలము రసాత్మకము, కఠినము. అంతరంగము జలము; బహిరంగము పృథ్వి. "యత్కఠినం సా పృథ్వీ" "యద్ద్రవం

త్రజాహా'' అని శ్రుతి. ఈ బహిరంగాంతరంగములకు మూలము రూపగుణాత్మకమగు తేజస్సు. అదే ప్రకాశత్రయాద్యమగు చైతన్యభావము. 'తేజో వారి మృదామ్' అనువాని వినిమయార్థమిదియే. 'చైతన్యస్వరూపా చిచ్ఛక్తిః' 'తత్త్వత్రయేణ సా వివిధా' అను శక్తిమీమాంసా సూత్రములతో సమన్వయము గలది; గావున సర్వము శాక్తము. అందు శ్రీమద్భాగవత మొకటి.

అసలు శ్రీశుకులెవ్వరు? వీరికి వేదమందెట్టి స్థానము కలదు? వీరు బ్రహ్మవిద్య నుపాసించిన దెటులు? వీనిని గొలఁదిగా విమర్శింతము. అష్టోత్తరశతోపనిషత్తులందును శుకరహస్యోపనిషత్తనునది యొకటి. శ్రీమద్వేదవ్యాసులు. శ్రుతిః— "దేవదేవ మహాదేవ పాశచ్ఛేదదృఢవ్రత। శుకస్య మమ పుత్రస్య వేదసంస్కారకర్మణి। బ్రహ్మోపదేశకాలోఽయమిదానీం సముపస్థితః॥" బ్రహ్మోపదేశః కర్తవ్యో భవతాద్య జగద్గురో''అని ప్రార్థించిరి. శ్రీశుకులకు మొదట నుపదేశింపఁబడినది ప్రణవము. "తస్మాత్ ప్రణవం లబ్ధ్వా"అని శ్రుతి. అటుపిమ్మట నాలుగు వేదములనుండి నాలుగు మహావాక్యములుపదేశింపఁబడినవి. పిమ్మట "తత్త్వమసి"యను మహావాక్యమునందలి తత్ – త్వమ్ – పదార్థోపాసన ముపదేశింపఁబడినది. "హంసోఽహమ్" అని తత్పదార్థోపాసనము. "ఐం, క్లీం సౌః" అని త్వం పదార్థోపాసనము. "త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి"అని కదా శ్రుతి. తుదకు "అసి" మహామంత్రము పేరి అర్ధనారీశ్వరోపాసన ముపదేశింపఁబడినది. అన్నింటిసమాహారభావోపాసనమే మహాశక్త్యుపాసనమనిడి శాక్తమని యీసంశయవిచ్ఛేదినియందు నిరూపింపఁబడినది. సర్వమును శాక్తము.

తాను గ్రహించిన విద్యనే యేరూపమునన్నైన యథాయోగ్య ముగ అధికారి భేదము ననుసరించి శ్రీశుకులుపదేశించిరి.

అదియుఁగాక శ్రీమద్భాగవతాంతర్గత సాంకేతికపదార్థసమన్వయము నిట్లు గ్రహింప వలసియున్నది. శ్రుతి:-"దేవకీ బ్రహ్మపుత్త్రా సా యా వేదైరుప గీయతే। నిగమో వసుదేవో యో పదార్థః కృష్ణరామయోః" ఇతి. శాక్తమనుట కింక సందేహమెక్కడిది? సర్వవేదోపగీయమానమగునది మాతృభావపూర్ణమగు బ్రహ్మము. శ్రుతి 1. "కామపదేనాఽసౌ పరం బ్రహ్మాభిధీయతే। చిన్మయస్యా ద్వితీయస్య నిష్కలస్యా శరీరిణః। ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా 2. రూపస్థానాం దేవతానాం పుం స్త్ర్యంగాది కల్పనా 3. జీవవాచీ నమో నామ చాత్మా రామేతి గీయతే తదాత్మికా యా చతుర్థీ తథా మాయేతి గీయతే॥

శాక్తమందుఁ జిదన్వయమే లక్ష్యమగుట సర్వమును శాక్తమనుట సిద్ధము. "వాసుదేవ స్సర్వమహం ద్వాదశం భవతి"అని యుపదేశము. ద్వాదశకమగు మహావాక్యమిది యగుటవలన శ్రీమద్భాగవతము స్కంధద్వాదశ సంకలితము. లౌకికశబ్దార్థ నిర్వచనమందు వసుదేవాపత్యమే పుంభావమున వాసుదేవుఁడు. వాసుదేవభావమే నిగమకల్పతరుగలితఫలము.

ఓం ద్రాం నమః.

శ్రీ మాత్రే నమః

శ్రీ శ్రీయానంద నాథ గురవే నమః

# అనుభూతి.

"నాత్ర తత్ర చ తద్వ్యాప్తిరస్తి నాస్తీత్యయం తతః
సర్వైర్యుక్తశ్చ సర్వాత్మా సర్వాధిగత ఏవ చ॥
స్వయం చ స్వపరాన్యశ్చ తథైవాయం మమైవ చ
సోఽయమాత్మా చ సర్వత్ర తతః సర్వపరావరః.

అని యుపదేశము.

మహర్షులిట్లు వచించిరి. "ఆత్మనశ్చ గుణాస్సర్వాం" ఇతి సూత్రం. గుణైర్జాతమిదం జగదితి తద్భావః। ఆత్మగుణ సహితశ్చ సంసారః। ఆత్మనశ్చ ద్రవ్యపదార్థత్వాత్ స ఏవ గుణాధికరణో భవతి। తజ్జాయమానం చ కర్మ ఇతి ద్రవ్య గుణ కర్మపదార్థాః।ఇదమేవ పదార్థత్రయం సర్వత్ర లక్ష్యతే। అస్యైవ గుణాత్మకత్వం త్రిగుణాత్మకత్వం చోచ్యతే। అత ఏవ నిర్గుణం సగుణం బ్రహ్మేత్యుక్తిర్భవతి। యదిదం నిర్గుణం తన్నిషిద్ధస్వరూపం సంబంధమాత్రం; సగుణం చ సంసారాత్మ స్వరూపమితి తద్వ్యాఖ్యార్థః। సగుణం బ్రహ్మ, నిర్గుణం బ్రహ్మ ఇతి పృథక్ భానస్తు మిథ్యా। "యదిదం నిర్గుణం బ్రహ్మ తదేవ సగుణం మతం" ఇతి చోక్తేః. సగుణమన్యద్బ్రహ్మ, నిర్గుణమన్యద్బ్రహ్మేతి తు భ్రాంతవాక్యం। గుణేన సహ బద్ధోఽయమాత్మా గుణరూపేణ వర్తతే। నిర్గుణం చ తయో స్సంబంధరూపం ప్రశస్తం। పృథగుపాదానం చైతయోః

కేవలబోధప్రాధాన్య నిరూపణాయ భవతి। "నాయమాత్మా స్థితో, న బద్ధో, న పృథక్, న భూతో, న జాతో, నామృతో, న మృతో, న ముక్తో, నాముక్తో, నానుగతో, నానుకరణ ముపకరణం చ"

ఇత్యాది వచనములవలన ఆత్మసంసారముల ప్రత్యేకతానిషద్ధరూపమే ఎఱుంగఁబడుచున్నది. అనగా విభిన్న భావరాహిత్యమును, అవినాభావసంబంధమును, సర్వభావాఖండైక్యసిద్ధియు, నేకైకభావముగాఁ దెలియఁబడుచున్నది. పృథక్కరణము నిరసింపఁబడుచున్నది. సర్వమునకును చైతన్యమే కారణము, సర్వమును, చైతన్యకార్యమే, అందువలన శాక్తాద్వైతసిద్ధి.

"కాలోఽశనం హి సర్వేషాం సర్వం కాలసమాశ్రితమ్" అని శ్రుతి. "కాలేన సర్వాణి జాతాని, జాయంతే" ఇత్యాది వచనములు. అందువలన సర్వము కాలికమే, అట్టి చైతన్యస్వరూపయే కాలిక.

"కాలత్రితయస్య యోజనమేవ సర్వమితి జ్ఞేయం। యస్య చ వ్యతీతత్వం, తస్యైవాసీదితి భూతకాలక్రియయా వ్యవహారః। యస్య చ స్థితిః, తస్యైవాస్తీతి వర్తమాన కాలక్రియయా వ్యవహారః। తాభ్యామన్యస్య భవిష్యతీతి భవిష్యత్కాలక్రియయా వ్యవహారః। ఏవమేవ వ్యవహారో భ్రమోపాత్త ఏవ। వస్తుతస్తు వర్తమాన ఏవ భూతః, స ఏవ భవిష్యః ఇతి విజ్ఞేయమ్, అత ఏవ

"వర్తమానం హి సర్వం స్యాన్నచ భూతం భవిష్యజం
అస్త్యేవ సర్వథా సర్వం తదావశ్యక ముత్తమం"

ఇత్యాద్యావశ్యక వ్యాఖ్యానతయా భూతో భవిష్యశ్చ న కశ్చిత్ । సర్వం వర్తమాన రూపమేవేతి జ్ఞేయం'' అని ఆర్ష నిర్ణయవచనములు. తత్త్వార్థబోధకొఱకై కాలత్రయ కల్పనము. కాలమెప్పుడును వర్తమానమే. ''కాలస్య సార్వత్రికత్వాత్ సర్వస్య కాలికత్వాచ్చ, తయోశ్చాప్య నాద్యనంతిత్వం । అతః క్రియాణామభేద ఏవ'' అని మహర్షి వచనములు.

అరూపాయాః కాలికాయాః కాలమాతుర్మహోద్యుతేః ।
గుణక్రియానుసారేణ క్రియతే రూపకల్పనా॥

అని యుపదేశము. 'వస్తుతస్తు, స్మృతిరేవ సర్వం। అనుస్మరణ విస్మరణే చ తదంతర్గతే। సత్తా తు తత్క్రియాణాం విచారరూపా। అత స్త్రితయాత్మకో విచారశ్చైకస్వరూప ఇతి విద్ధీత్యుపదేశః। సర్వథాఽస్త్యేవేతి ప్రవచనాత్, యదద్యాస్తి తదేవాన్యస్మిన్నపీతి, అనుస్మరణవ్యాపారః। తత్రాప్యస్తిత్వే తన్నిశ్చయరూపం, ఆత్మనః సంసారస్య చాభేదాదన్యోఽన్యాశ్రితత్వాచ్చ। అనుస్మరణం తు సంసారస్య, తచ్చ స్మరణేన బద్ధం, స్మరణమను ఇతి తత్సమాసాత్ । యద్యప్యనుస్మరణేఽపి సందేహః తథాపి సందేహస్య సంబంధరూపత్వాత్, సర్వాంతర్గతత్వాచ్చ తయోరభేద ఏవ విజ్ఞేయః।అనుస్మరణం తు స్మరణాధీనం, స్మరణం చానుస్మరణాధీనమితి, ఆత్మసంసార నిష్ఠవ్యాఖ్యానేన బోధ్యం।భవనమాత్రస్యానాద్యనంతత్వాత్, సత్తాప్రాధాన్యాచ్చ, స్మరణం సార్వకాలికం భవతి । యచ్చ స్మరణం తదేవ ధారణం । స్మరణం సాధనరూపం, ధారణం సిద్ధిరూపం । అనేన చ స్మరణం క్రియారూపం, తత్ఫలం చ

ధారణరూపమితి బుధ్యతే" అని మహర్షులు సిద్ధాంతీకరించిరి. ఈ సిద్ధాంతముపైనే సర్వమంత్రోపాసనాసిద్ధియు నాధారపడి యున్నది.

ఋగ్వేదైర్వా యజుర్వేదైస్తత్సామాథర్వసంజ్ఞకైః
ప్రత్యేకం తం నిరర్థం స్యాచ్చతుర్భిర్బ్రహ్మ బుధ్యతే

స ఋగ్వేదసిద్ధో విశుద్ధోఽయ మాత్మా
యజుర్వేద మూలప్రయుక్తోఽయమాత్మా
తథా సామగస్సామగీతోఽయమాత్మా
హ్యథర్వస్థితో యుక్తిమూలశ్చ వేద్యః

తథా జ్ఞాననిష్ఠః ప్రమేయోఽయమాత్మా
క్రియావృత్తిసిద్ధః ప్రమాణోఽయమాత్మా
ప్రమాణః ప్రమేయ స్తథా సంశయస్థః
స చ వ్యాపకోఽవ్యాపకశ్చ ప్రమోదీ॥

న జ్ఞానాల్లభ్యతే బ్రహ్మ కేవలేన చ కర్మణా
నేచ్ఛయా లభ్యతే బ్రహ్మ బ్రహ్మతత్త్వం చతుష్టయం॥

అని ప్రవచనములు.

'ఋతం సత్యం పరం బ్రహ్మ' ఇతి। తం తత్పదార్థం పరం బ్రహ్మ 'ఋ' సత్యమిత్యర్థః అని తత్త్వవిమర్శినీకారులు.

"బ్రహ్మ తత్త్వం చతుష్టయం అను ప్రవచనార్థమును సిద్ధాంతీకరించుటకు ఋకారసంఖ్యాసామరస్య సిద్ధికంటె వేఱొక ప్రమాణముతోడఁ బనిలేదు. శ్రుతిః— అమాత్ర శ్చతుర్థోఽవ్యవహార్యః, ప్రపంచోపశమః శివోఽద్వైత ఏవ

మోంకార ఆత్మైవ సంవిశత్యాత్మనా ఆత్మానం, య ఏవం వేద." (మాండూక్యోపనిషత్తు)

> సా జ్ఞానేచ్ఛాక్రియారూపా శక్తిర్యేన విభావ్యతే।
> వేదవేత్తా భవేత్సోఽపి సర్వజ్ఞానపరాయణః
> ఋగ్యజుస్సామాథర్వభిరేవం జ్ఞానం నిరూపితం
> జ్ఞాత్వా వేదాంతసిద్ధాంతం బ్రహ్మరూపం స్వయం లభేత్॥

అని ప్రవచనము.

ఓం ద్రీం క్లీం నమః.



శ్రీమాత్రే నమః

శ్రీ శ్రియానందనాథగురవే నమః

# నేనెవరు?

## ప్రథమ పటలము

నేను బూర్ణుఁడను గానేమో? అందువలననే నేనై వ్రాయుచున్నాను తత్త్వార్థబోధకొఱకై భిన్నముగా నెఱుంగఁబడిన యనేకత్వమునకు బోధానంతర మేకత్వము సిద్ధించినది. కాని పరిణామదశయందుఁ బ్రాకృతమై యంటియున్న సంస్కారవశమున నైసర్గికమై యా యేకత్వభావము సిద్ధించినను, ననేకభావాభాసము స్వప్నమువలెఁ బ్రతిబింబించుచునే యున్నది. పూర్ణతత్త్వసిద్ధియైనచో నేననెడి భావము నామరూపరహితమైనదగును. అట్టి భావమును బొందుటకై గ్రహించునదే పూర్ణదీక్ష. నేను బూర్ణతం బొందినపిమ్మట వ్రాయునది యుండఁజాలదు. పూర్ణుని లక్షణము మౌనము. మౌనము దాల్చినందున నతఁడు ముని.

శ్రుతిః- యస్మాద్వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ।
యన్మౌనం యోగిభిర్గమ్యం తద్భవేత్సర్వదా ఽజడైః॥

శ్రుతిః- వాచో యస్మాన్నివర్తంతే తద్వక్తుం కేన శక్యతే
ప్రపంచో యది వక్తవ్యః సోఽపి శబ్దవివర్జితః।
ఇతి వా తద్భవేన్మౌనం సర్వం సహజసంజ్ఞితం
గిరా మౌనం తు బాలానా మయుక్తం బ్రహ్మవాదినామ్॥

శ్రుతి:- "యత్పరం విమలమద్వయం శివం తత్సదాఽహమితి మానసమాశ్రయ" అందువలననే — "మునిర్గచ్ఛతి భూతయోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్" అని వచించినది.

ముని గానివాని కట్టి మోక్షప్రాప్తిలేదు. ఇంక బ్రకృతము నాస్తిత యెట్టిదియో వినుడు. జీవునిగా నన్ను నేనెఱుంగు చున్నాను. ఇచట జీవశబ్దమునకు "జీవః పంచవింశకః" అను శ్రుతి లక్ష్యము. మనమందఱమును బ్రహ్మభావమగు నాత్మతత్త్వమునందలి యభిన్నప్రకృతియే. ఆత్మతత్త్వము నెఱుంగుటే తత్త్వజ్ఞానము. అది యెఱింగినవారే తాత్త్వికులు. 'అహం సువే పితరమస్య' అని ఋగ్వేదశ్రుతి. 'అహం బ్రహ్మాస్మి' అను మహామంత్రభావము ఋగ్వేదమందుఁ బైవిధముగ స్వాభివ్యక్తమగుచున్నది. శ్రుతి:- "అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం జ్ఞానానందం ప్రయచ్ఛతి." పురుషసూక్త ప్రతిపాదితమగు నది అస్మచ్ఛబ్దవాచ్యమగు బ్రహ్మాత్మైకశాస్త్రతియే. "సహస్రారంతు పురుషః సహస్రశీర్షా" అనియును, వసుకోణ దశారయుగ్మ మన్వస్రాః సహస్రారస్య వికృతయః సహస్రారంతు త్రికోణస్యేతి రహస్యం" మున్నగు గుప్తోపదేశము లిచట ననుసంధేయములు. ఈ రహస్యము ననుసరించియే మూలాధారపృథ్వీతత్త్వాత్మకమగు 'లకార'గంధము పంచోపచారపూజనమందాద్యమై, తదనంతరము తద్వికృతిమగు సహస్రారాకాశతత్త్వాత్మకమగు "హకార" పుష్పభావము ద్వితీయస్థానము నలంకరించుచు, సర్వసాంప్రదాయసిద్ధమై వచ్చుచున్నది. సూక్తమందలి ప్రథమపదమే సూక్తమున కంతటికిని బీజాత్మకమై మూలమై యుండును. పురుషసూక్తమునందుఁ బ్రథమ పదము 'సహస్రశీర్షా' అనునది.

ఆకారాంతో ప్రథమైకవచనము. సూక్తరహస్య మంతయును నిండమిడియున్నది. బ్రహ్మము మహాత్మ్యభావ పరిపూర్ణము. 'యతో వా ఇమాని భూతాని జాయంతే' — 'తద్బ్రహ్మ' అనియును శ్రుతి ప్రవర్తించుచున్నది. బ్రహ్మ మూలప్రకృతి, తాను తానుగానే యుండి, తన బ్రహ్మశక్తివలన సర్వభూతములను దానినుండి పుట్టించుచున్నది. శక్తి శక్తిమంతుల కభేదము అద్వైతసిద్ధి యగుటవలన బ్రహ్మమునకుఁ దదభిన్నమగు ప్రసవధర్మము నైసర్గికమైయున్నది. ప్రసవధర్మయుక్తమై యున్నందువలన బ్రహ్మము మాతృభావపరిపూర్ణము. అది యెఱుఁగఁబడుచున్నది. అదియే పొందఁబడుచున్నదని జీవులు తలంచుచున్నారు, కాని వారే యా బ్రహ్మభావమగుటవలనఁ బొందఁబడు తత్త్వము వేఱొకటిగ నుండలేదు. స్వాభిన్నమైనదే తత్త్వము.

శ్రుతి:- న తదస్తి న యత్రాహం న తదస్తి న తన్మయం।
కిమన్యదభివాంఛామి సర్వం సచ్చిన్మయం తతమ్॥

అంతయును బ్రహ్మభావమే. ఏకత్వమునకే గాని, నానాత్వమునకుఁ దత్త్వమును భావమునందుఁదావు లేదు. భావమనఁగా నర్థమేమియో "భూ'' ధాతువునుండి గ్రహింపఁబడుచున్నది. ఈ భూధాతువు సర్వమును దానయై యుండుట వలన వేదములందుఁ బ్రణవమువలె ధాతుపాఠమునం దాద్యమై యున్నది. ధాతుపాఠకర్త శబ్దతత్త్వజ్ఞుఁడగు పాణినిమహర్షి, "శబ్దం బ్రహ్మేతి విజ్ఞానాద్ బ్రహ్మ వై ప్రాప్యతే నరైః'' అని ప్రవచనము.

శ్రుతి:- ద్వే విద్యే వేదితవ్యే తు శబ్దబ్రహ్మ పరంచ యత్।
శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి॥

జీవునిగ నన్ను నే నెఱుంగుట యొక స్వప్నతుల్యమై నదియే. బ్రాహ్మ్యమగు కాలమానమున జీవుని జననమరణా ద్యంతమధ్యమకాలము క్షణికమగు స్వప్న కాలముకంటెను నల్పమైనదియే. ఆముష్మికేచ్ఛాపరులగువారలీజీవిత కాలమును బ్రాహ్మ్యమగు కాలమానముచే లక్షించుచుండుటవలన వారలకది కేవలస్వప్నతుల్యమే యగుచున్నది.

నేను స్వాయత్తచిత్తుఁడను గాను. పరాయత్తచిత్తుఁడను. పరాయత్త మనఁ — "పరా" యను నొక భావమునఁ కాయత్తమై యుండుచుంటయే. ఈ యర్థమే యథార్థము. పరులుగ భిన్నభావమునన జ్ఞానగతులగు జీవులందఱును జ్ఞాన దృష్టిగోచరులగునపుడు, పరాభావమే యగుచున్నారు. అంత యును అమ్మయే. అమ్మయే అమ్మ నెఱింగి యానందించుచున్నది. అది యామెకు స్వాభావికమైనది. నేనేమి చేయుచుందునో, యెందులకై చేయుచుందునో నే నెఱుంగను. దాని నెఱుంగుచో నన్ను నే నెఱుంగుటయను జ్ఞానము సంపూర్ణమైనటులే. అపుడు మునిని గావచ్చును. నేను లక్షించునది యూహింపరాని గమ్య స్థానము. ఆ స్థాన మగమ్యము. సర్వగమ్యస్థానముల బహి రంగ బృహద్భావమునందలి యంతరంగ భావమే యగమ్య స్థానము. గమ్యము స్థూలము. నానాత్వ విభాసితము; అగమ్యము సూక్ష్మము; ఏకత్వ భాస్వంతము. గమ్యము దేహమువంటిది; అగమ్యము దేహివంటిది.

కాలమెప్పుడును వర్తమానమే. అట్టి కాలభావము నే నేను. శ్రుతిః—కల్పనా సర్వభూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః, కాలశబ్దేన నిర్దిష్టం హ్యాఖండానందమద్వయమ్॥ కాలి నియ మార్థధర్మగుణైక ప్రతీయమానత త్త్వ యగుటవలన సర్వాధి

ష్టాత్రియై బ్రహ్మశక్తి యగుచున్నది. కాలశక్తియే కాళి యగుటవలనఁ గాలమునకు సంబంధించిన సర్వతత్త్వములు నామె స్వరూపము. కనుకనే 'కాలికా' యనఁబడుచున్నది. కాలికమను వైయాకరణ ప్రయోగవిధి ననుసంధించునది. 'కాలీ' యను శబ్దమును వైయాకరణులు పుం స్త్రీలింగము లందును, కాలిక శబ్దమును నపుంసకలింగమందును ప్రయోగించుచున్నారు. "ఏషైవ పరమేశ్వరీ మూలశక్తిః దుర్బలాధికారిణాముపాసనాసౌకర్యాయ తంత్రాదిశాస్త్రేషు కాలీతారాది వివిధనామరూపైః కల్పితా" అని చెప్పఁబడుచున్నది.

అరూపాయాః కాలికాయాః కాలమాతుర్మహాద్యుతేః।
గుణక్రియానుసారేణ క్రియతే రూపకల్పనా॥

అనియును గలదు. కాలికాశబ్దార్థమునందు ఆద్యంతరహితత్వమును, అనంతత్వమును, సూక్ష్మత్వమును, విశ్వాత్మకత్వమును గలవు.

శ్లో॥ క్షుత్ క్షామాం కోటరాక్షీం ప్రలయఘనరవాం ఘోరరూపాంచ చణ్డామ్। దిగ్వస్త్రాం పింగకేశీం ధృతడమరుసృణిం ఖడ్గపాశాభయాని। నాగం ఘంటాం కపాలం కరసరసిజైర్ధారిణీం కృష్ణవర్ణామ్। ధ్యాయామి ధ్యేయరూపాం సకలసుఖకరీం కాలికాం తాం నమామి.

"అహం బ్రహ్మస్వరూపిణీ మత్తః ప్రకృతిపురుషాత్మకం జగత్ శూన్యంచాశూన్యం చ। అహమానందానానందే। అహం విజ్ఞానావిజ్ఞానే అహం బ్రహ్మాబ్రహ్మణీ వేదితవ్యే। అహం పంచభూతాన్యపంచభూతాని అహమఖిలం జగత్। వేదోఽహమవేదోఽహం విద్యాహమవిద్యాహం అజాహమనజాహం॥" అని (అధర్వశీర్షము)

శ్రీమదాత్మతత్త్వవిచారకులగు శ్రీశంకరులు బ్రహ్మాత్మైకభావమునట్లు స్వాత్మానుభూతితో ధ్యానించిరి.

శ్లో॥ గిరామాహుర్దేవీం ద్రుహిణగృహిణీమాగమవిదో
హరేః పత్నీం పద్మాం హరసహచరీమద్రితనయామ్।
తురీయా కాపి త్వం దురధిగమనిస్సీమమహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి॥

మంత్రగర్భితమగు నీశ్లోకమునకు మూలాధారము చక్రము; మాయాబీజము (హ్రీం) కారణభావము; అవియే ఆధారాధేయములు. అఖండైకరసస్వరూపిణి యగు మహామాయ దేవత. ఆత్మతత్త్వమే బ్రహ్మము. అచట స్త్రీత్వ పుంస్త్వ నపుంసకత్వాది భేదాభాసము లేదు. సుందరి, శ్రీవిద్యాధిదేవత. త్రిపురవిహారిణి యగుటచే నామెను త్రిపురసుందరి యని విశేషయుక్తముగ ననుచున్నారు. అట్టి సుందరీభావము సౌందర్యము. తేజస్సు అమృతతరంగసంకలితము. అట్టి యమృతమహోదధియందలి లహరీభావమే సౌందర్యలహరి. శ్రీమత్పూజ్యపాదులు స్వాత్మానుభూతినొంది యాయనుభూతిని వాగమృతరూపమున నభివ్యక్త మొనరించికొనిరి. సౌందర్యలహరియందీ శ్లోకము 99 వది. సంఖ్యాసామరస్యముచే నది బ్రహ్మభావప్రతిపాదకము. కావున బ్రహ్మశాక్తభావప్రతిపాదకమైనది. సౌందర్యలహరియందీపద్యము అమృతనాభియై యున్నది. సర్వవేదాంతవేద్యమగు తత్త్వమును ప్రతిపాదించుచున్నది.

మూలప్రకృతియే ప్రధాన పురుషభావమున నొప్పుచున్నది. తత్త్వార్థబోధకొఱకట్టి యఖండైకభావమునే భిన్నదృష్టిచే బురుషప్రధాన మూలప్రకృతులుగను, ప్రకాశ

ప్రవృత్తి నియమార్థములుగను, ప్రకాశవిమర్శమిశ్రములు గను, జ్ఞానక్రియేచ్ఛలుగను, సత్త్వరజస్తమములుగను నిలుంగుచున్నారు. అఖండైకభావమునం దీభిన్నదృష్టియును భేదాభాసమును లేదు. "అహమా బీజమయా, వరుణాలయ సంభవా, సూర్యమండల సంభూతా" యను నామక్రమము ఈ మూలప్రకృత్యాది తత్త్వత్రయాత్మక త్రిగుణప్రతీయమాన భావక్రమమునే బోధించుచున్నది. మూలప్రకృతిభావము మాయనది కాదు. కావునఁ బ్రధానపురుషుల యుక్కయును బరిణామశీలమైనను, కారణభావమందో కార్యభావమందో సర్వదాయుండునదే. అదర్శనమే లోపించుట యను భావము; లోపమునందును సత్త కలదు. శ్రుతి:- "మాయా చావిద్యా చ స్వయమేవ భవతి"; అట్టి మహామాయనే బ్రహ్మభావమున శ్రీ శంకరులు ధ్యానించిరి

ప్రకృతి = Mass; పురుషప్రకృతి = Energy; ఈ రెంటిను నొకటియే యని యాధునిక శాస్త్రవేత్తలును నిర్ణయించి యున్నారు.

"Prior to relativity, scientists had pictured the universe, as a vessel cotaining two distinct elements. Matter and Energy — The former inert, tangible and characterized, by a property called mass, and the latter active, invisible and without mass. But Einstein showed that mass and energy are equivalent; the property called mass is simply concentrated energy. In other words, matter is energy and energy is matter, and the distinction is simply one of temporary state. (Lincoln - B)

In short energy has mass.

Equation :- $M = E / C^2$ $(E = MC^2)$ } Dr. Einstein

Notes :- M = Mass of a body moving. E = Energy. C = The constant velocity of light in physics 186284 miles a second. ఇంతవఱకైనను ఆధునిక వైజ్ఞానికులు సాధింపఁగల్గుట ప్రశంసాపాత్రమే.

ఈ రెండింటి సమాహారభావమే యంతరంగమున మూలప్రకృతిగను బహిరంగమునఁ బ్రకృతిగను భాసించు చున్నది. ఈ మూఁడింటి బృహద్భావమే బ్రహ్మము. అదియే మహామాయ.

"In its vast cosmic picture, when fully revealed, the abyss between macrocosmos and microcosmos — the very big and the very little — will be bridged and the whole complex of the universe will resolve into a homogeneous fabric. in which matter and energy are indistinguishable and all forms of motion from the slow wheeling of the galaxies to the wild flight of the electrons become simply changes in the structure and concentration of the primordial feild. (of Dr. Einstein.)

ప్రకృతివలన మహత్తును, దానివలన నహంకారంగము మున్నగు సర్వము జనించెను. శ్రుతిః — "ప్రకృతేర్మహాత్ మహతోఽహంకారః" ఇతి. అట్టి సర్వభావమగు చైతన్యమే బ్రహ్మము. శ్రుతి:— "కిం బ్రహ్మేతి హోవాచ, మహదహంకార పృథివ్యప్తేజో వాయ్వాకాశాత్మకత్వేన, బృహద్రూపేణాండకోశేన కర్మజ్ఞానార్థరూపతయా భాసమానం అద్వితీయం అఖిలోపాధి వినిర్ముక్తం తత్ సకలశక్త్యుప బృంహితం అనాద్యనన్తం శుద్ధం శివం శాన్తం నిర్గుణమిత్యాది వాచ్యం అనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ."

శ్రుతిః:— ప్రకృతిరితి చ॥ "బ్రహ్మణః సకాశాన్నానా విచిత్ర జగన్నిర్మాణ సమర్థక బుద్ధిరూప బ్రహ్మశక్తిరేవ ప్రకృతిః॥" శక్తి కారణభావము, బ్రహ్మము కార్యభావము. కార్యభావమగుటచేతనే బ్రహ్మము బృహద్భావ మైనది. "బ్రహ్మశక్తిః" అనుచోటఁ బూర్వపరశబ్దములందలి పూర్వ పదషష్ఠ్యంతమందు రహస్యార్థము కలదు. అంగాంగీభావ సంబద్ధమగు తత్త్వమం దంగభావము కారణరూపమును, అంగి కార్యరూపమును నగుచున్నవి. "యచ్చ యస్య సాధనం భవతి తస్య తదంగం భవతి" అని సూత్రము. శ్రుతి "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" "తస్మిన్ మరుశుక్తికా స్థాణు స్ఫటికాదౌ జలరౌప్యపురుషరేఖాదివత్ లోహితశుక్ల కృష్ణ గుణమయీ గుణసామ్యా అనిర్వాచ్యా మూలప్రకృతి రాసీత్॥" మూలప్రకృతి యనిర్వాచ్య; అనిర్వాచ్యమగు చైతన్యము బ్రహ్మభావము. బ్రహ్మ మొక్కటియే (ఏకం ఏవ) వేఱొక భావ మెద్దియును లేదు (అద్వితీయం "ఏకమేవా ద్వితీయం") అన్నపుడు తద్భిన్నభావ భ్రమకుఁ దావులేదు.

ఇక మూలప్రకృతి యెక్కడిది? అనఁగా — 'తస్మిన్' అని తత్త్వార్థబోధకోటకు బ్రహ్మగుణమును శ్రుతి యుపదేశించుచున్నది. అదియే బ్రహ్మమూలప్రకృతి. "గుణేన గుణీ ప్రతీయతే" అనికదా. బ్రహ్మతత్త్వార్థబోధకోటకు విభజింపఁబడిన ద్వైవిధ్యమే కాని యథార్థమందు మూలప్రకృతియే బ్రహ్మము. బ్రహ్మశక్తియే బ్రహ్మము 'పరబ్రహ్మమహిషి' అను శ్రీశంకరభగవత్పాదప్రయుక్త శబ్దార్థ మిదియే.

'తస్మిన్ ఇతి నిర్దిష్టే పూర్వస్య' అను పాణినీయసూత్ర రహస్యార్థము. శ్రుతియందలి 'తస్మిన్' అను పదల ననుసంధే

ఉపము. సదసత్తులును, సగుణనిర్గుణములును మరుజలశుక్తికా రౌప్య స్థాణు పురుష స్ఫటిక రేఖాదులును, ఏకైక భావమున భాసించునపుడే "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అను శ్రుతి లక్ష్యము సిద్ధించుచున్నది. అదియే పూర్ణమైనది. అది యిట్టి యననేల? 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని శ్రుతి ప్రవర్తించు చున్నది. ఇట్టి యథార్థ భావబోధ్యమునకై శ్రుతి:— "దేహాదేః పరతరత్వాత్ బ్రహ్మైవ పరమాత్మా। స బ్రహ్మ। స విష్ణుః। స రుద్రః। స ఇంద్రః। స శమనః। స సూర్యః। స చంద్ర। స్తే సురా। స్తే అసురా। స్తే పిశాచా। స్తే మనుష్యా। స్తాః స్త్రియ। స్తే పశ్వాదయ। స్తత్ స్థావరం। తే బ్రాహ్మణాదయః సర్వం ఖల్విదం బ్రహ్మ। నేహ నానాస్తి కించన" అని ప్రవచించుచున్నది.

శ్రుతి:– యథా తరంగ కల్లోలైర్జలమేవ స్ఫురత్యలం।
ఘటనామ్నా యథా పృథ్వీ పటనామ్నా హి తంతవః,
జగన్నామ్నా చిదాభాతి సర్వం బ్రహ్మైవ కేవలమ్॥

అని సర్వమును బ్రహ్మముగానే ప్రబోధించుచున్నది. కనుకనే సర్వజ్ఞుఁడగు వ్యాసుఁడు —

"బ్రహ్మ సత్యం జగత్సత్యం సత్యం చైవ ప్రజాపతిః,
సత్యాద్భూతాని జాతాని సత్యం భూతమయం జగత్"

అనినాడు.

ఇఁకఁ జేతనమైన దెయ్యది? జడమైన దెయ్యది? సత్యమైన దేది? అసత్యమైన దేది? జ్ఞానాజ్ఞానాది విభేద మెట్లు సిద్ధించు చున్నది? అభిన్న భావమునకు భిన్న భావసిద్ధి కల్గినదా? కల్గింపఁ బడినదా? ఉన్నదా లేక భిన్నాభిన్న ద్వైతాద్వైతసదసద్భావాది పూర్ణమే బ్రహ్మమా? మున్ను లేఖింపఁబడిన యథర్వశీర్షము

నొక్కసారి యిచట సమన్వయించుకొని భావింపుఁడు. అసలు సర్వస్వభావమును సర్వోద బ్రహ్మశబ్దమును లేదు, వర్తింపదు—'సర్వే నాశే భేదనాశః' అనినటు ప్రవచనము, మఱి యే విమర్శనము బ్రాహ్మణ భావమునందుఁ జొప్పడదు. తత్త్వార్థబోధ కొఱకు సాధనముగ నిది యంతయును గల్పింపఁబడుచున్నది. తత్త్వార్థబోధమును దత్త్వబోధమును మహాప్రకృతిగుణములే; బోధానంతరదశయందు మాత్రము నానికి మఱల సిద్ధిలేదు.

శ్రుతిః- "ఋతమాత్మా పరం బ్రహ్మ సత్యమిత్యాదికా బుధైః।
కల్పితా వ్యవహారార్థం యస్య సంజ్ఞా మహాత్మనః"

సంధ్యాదులు పరిపూర్ణులగువారికి సిద్ధించుచుండును.
శ్రుతిః- "పరమాత్మాఽఽత్మనో రేకత్వజ్ఞానేన తయోర్భేద ఏవ విభగ్నః సా సంధ్యా" ఆ సంధ్యాదేవియే చిచ్ఛక్తి. అది సిద్ధించిన పూర్ణునియందు స్నాన సత్యభాషణ విద్యా తపో జ్ఞానములు సాధారణధర్మములుగ నుపాధి యుండునంతవఱకు మూర్తీభవించియుండును.

స్మృతిః- "అద్భిర్గాత్రాణి శుద్ధ్యంతి మనస్సత్యేన శుద్ధ్యతి।
విద్యా తపోభ్యాం భూతాత్మా బుద్ధిర్జ్ఞానేన శుద్ధ్యతి"

అట్టి శుద్ధుఁడే వేదాంతోపగతఫలమగు "సాహం" భావమును బొందును.

శ్రుతి : యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగ్గుప్తేచ సర్వదా।
సవై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్॥

సర్వం అనఁగా బ్రహ్మభావమని యర్థము. "వేదాంతోపగతం ఫలమ్" అనఁగా బ్రహ్మభావప్రాప్తి యని యర్థము. అట్టి సిద్ధినొందుటకే పత్నీసహితముగ శాక్త (శ్రీవిద్యా)

పూర్ణదీక్షాగ్రహణముచేయుట. శ్రుతి :- యజతే పురుషో యజమానః । బుద్ధిం పత్నీం పరిగృహ్యా దీక్షాం సంతోషం ధీంద్రియాణి యజ్ఞపాత్రాణి కర్మేంద్రియాణ్యుపకరణాని స్రతే శారీరకే తత్తదేవతా ఏవ ర్త్విజః తటస్థా ఏవ యథాదేశం యజమానమనుయజంతే॥"

పురుషశబ్దముచే నపౌరుషేయము కానట్టి భావము లక్షితము. అయినచో బంధితులనఁబడు వారెల్లరును బూర్ణ దీక్షాగ్రహణము చేయుటయుఁగలదా? సత్కర్మపరిపాకము గలవారు మాత్రమే దీక్షాగ్రహణము చేయుట నైసర్గికమై యున్నది. శ్రుతి:- "సత్కర్మపరిపాకతో బహూనాం జన్మ నామంతే నృణాం మోక్షేచ్ఛా జాయతే, తదా సద్గురు మాశ్రిత్య చిరకాలసేవయా బంధాన్మోక్షం కశ్చిత్ప్ర యచ్ఛతి॥" అదియునుంగాక జ్ఞానసిద్ధి గల్గినంతమాత్రమునఁ బ్రారబ్ధము నశింపదు. కాని ప్రారబ్ధబద్ధుఁడై జ్ఞాని నిమిత్త మాత్రముగ నాచరించెడి కర్మఫలమాతని నంటఁజాలదు. ఆతఁడును విధివశమునఁ గర్మముల నాచరించుచున్నను, నిష్కామి యగుటవలన జీవన్ముక్తుఁడే.

శ్రుతి:- కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః।
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే॥

అట్టివారు ప్రారబ్ధక్షయానంతరము విదేహకైవల్య ముక్తిం బొందుదురు. అదియే పొందఁదగినది. శ్రుతి:- ఉపాధి వినిర్ముక్తఘటాకాశవత్ ప్రారబ్ధక్షయాద్విదేహముక్తిః.

జ్ఞానమన నెట్టిది? చిచ్ఛక్తిదర్శనమే జ్ఞానము. శ్రుతి:- జ్ఞానమితి చ॥ దేహేంద్రియ నిగ్రహ సద్గురూపాసన శ్రవణ

మనన సిది ధ్యాసనై-ర్యద్-దృగ్దృశ్యరూపం-సర్వాంతరస్థం సర్వగమం ఘటపటాది పదార్థమివా వికారం వికారేషు చైతన్యం వినా కించిన్నాస్తీతి సాక్షాత్కారానుభవః జ్ఞానమ్॥

1. Colour, taste, smell and sound can no more be ascribed to the external objects than can the tickling or the pain caused, some times by touching such objects (Galileo).

2 Sweet and bitter, cold and warm, as well as all the colours, all these things moist but in opinion and not in reality (Democritus).

3. Shape, motion, solidity and all geometrical properties were real or primary qualities, inherent in the object it self. Secondary qualities, like colours, sounds. tastes, were simply projections, upon the organs of sense. (John. Locke).

4. Not only light, colour, heat and the like but motion, shape and extention too, are mere apparent qualities (Leibnitz).

5. All the choir of heaven and furniture of earth, in a word all those bodies which compose, the mighty frame of the world, have not any substance without the mind. They must either have no existance at all, or else subsist in the mind of some Eternal spirit. (Berkeley).

6. Even space and time are forms of intuition, which can no more be divorced from consciousness than can our concepts of colour, shape or size. Space has no objective reality except as an orderly arrangement of the objects, that are being perceived in it and time has no independent existance apart from the order of events by which they are being measured. (Einstein)-

బెర్క్లీ చెప్పిన Eternel spirit అనుదాని బీజభావమే శ్రీకారము. దానిని భావించుటే శ్రీ విద్యాజ్ఞానము. అట్టి జ్ఞానమువలన నాత్యంతికమగు సుఖము కలుగును. ఆసుఖ మెట్టిది? శ్రుతి: "సుఖమితి చ॥ సచ్చిదానందానుభవస్వరూపం

స్వాత్మా ఆనందరూపో యత్ స్థితిః, స ఏవ సుఖం।'' అది యతీంద్రియమైనది. సచ్చిదానంద మనఁగా సద్ భావ మాత్రమే బీజముగా నుండి బీజాంతరంగమగు సచ్ఛక్తి వలన జీవబహిరంగమై యొప్పు నానందకీలకభావము. ''అ ఇ ఉణ్'' అను సూత్రరహస్యార్థ మిట్టిదియే. అదియే అనుభవ స్వరూపము. అనఁగాఁదన రూపమునందలి తత్త్వానుభూతి యని యథార్థము.

శ్రుతులు విభిన్నాధికారుల నుద్దేశించి యాయా సందర్భముల ననుసరించి ప్రవర్తించును. గావున సమన్వయవేళ నధికారిభేదము నెఱింగిన యెడల నది కుదురును. ఒకయెడ నిట్లున్నదే, యని విభ్రమము చెంద నక్కఱ లేదు. ఒక యధికారి దృక్పథమును బట్టి, యొకకర్మము నాచరించిన బంధము గల్గునని యొక సందర్భమున నుండవచ్చును. వేఱొక యధికారి దృక్పథమునుబట్టి యాకర్మమే యఖండజ్ఞాను సంధానమందు బంధకము కాదని యుండవచ్చును. అచట భావము ప్రధానము, గాని కార్యమాత్రము ప్రధానముగాదు. ఈ శ్రుతిని జూడుఁడు.

''బాహ్యార్థవాసనోద్భూతా తృష్ణా బద్ధేతి కథ్యతే,
సర్వార్థవాసనోన్ముక్తా తృష్ణా ముక్తేతి భణ్యతే.''

ఇటులే సర్వదృక్పథములను సమన్వయించుకొన వలెను. అట్టి సామర్థ్యము లేనివారు అనన్యమును నిస్సంశయాత్మకమునగు విశ్వాసముతో సద్గురుని సేవించుటే గత్యంతరము. అట్టి వారి నుద్దేశించియే యిట్లు చెప్పఁబడినది.

''తర్కోఽప్రతిష్ఠః శ్రుతయోపి భిన్నా
నైకో ఋషిర్యస్య వచః ప్రమాణం

ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గతః స పంథాః।"

పై శ్లోకమందలి చతుర్థపాదలక్ష్యమిీ శ్రుతి.

"సంతోషామృతపానేన యే శాంతాస్తృప్తిమాగతాః
ఆత్మారామా మహాత్మానస్తే మహాపదమాగతాః।"

అట్టి యుపాస్యగురుని లక్షణ మెట్టిది? శ్రుతి. "ఉపాస్య ఇతి చ॥ స్వశరీరస్థ చైతన్యబ్రహ్మప్రాపకో గురురుపాస్యః।" చైతన్యబ్రహ్మమనఁగాఁ జిచ్ఛక్తియే. అట్టి శాక్తస్వాహ్లాద యార్చనాత్మక పూర్ణదీక్షాప్రదాన సమర్థులగువారే గురుదేవ పదవి విరాజితులు. అయినచో వెదకినంత మాత్రమున నట్టి సద్గురుఁడు లభించునా? అనఁగాఁ బండితుఁ డందులకై వేచి యుండును గాని విచారింపఁడు. ఆ మహాశక్తియే యట్టిగురుని బ్రసాదించును. ఉపాస్యదేవతాచైతన్యలేశమే గురుఁడుకదా? "శ్రీగురుః సర్వకారణభూతా శక్తిః" గురుర్బ్రహ్మ యను భావమునందు గురుశబ్దమునకే గౌరవ ముండునంతవఱకును, బ్రహ్మశక్తిభావము గురుఁడనెడి యుపాధియందు సావధికమగు చున్నది. నిరవధికమగు బ్రహ్మభావమునందు గురుభావము నొక్కదానినే యెంచినయెడల నది భావలేశమనఁబడుట సుప్రయోగమగుచున్నది. "అహం బ్రహ్మాస్మి" యను సాధన యందును, దాను శిష్యుఁడనెడి భావము స్ఫురించుచుండునంత వఱకును, బ్రయుక్తబ్రహ్మభావము సావధికమే. ఉపాసనము ఫలించినయనంతరము సర్వమును బ్రహ్మభావమై యొప్పు చుండునపుడు నిరవధిక బ్రహ్మభాసనము దర్శింపఁబడును. అపుడు గురుశిష్యభావమునకు అఖండైకభావసిద్ధి గలిగి, గురుని యెడ నుపాస్యదేవతాలేశప్రసక్తి యనునది యుండదు. గురు

భావ శిష్యభావములు రెండును నద్వైత బ్రహ్మభావమగుటను వేఱొక ప్రసక్తికే సిద్ధియుండదు.

పండితులే పూర్ణదీక్షాధికారులు. పండితలక్షణ మెట్టిదియో యీ శ్రుతి చెప్పుచున్నది.

అనాగతానాం భోగానా మవాంఛన మకృత్రిమమ్।
ఆగతానాంచ సంభోగ ఇతి పండితలక్షణమ్॥

అట్టి పూర్ణదీక్షాధికారులగువారల భావము నీ శ్రుతి బోధించుచున్నది.

శ్రుతి:- న త్యజంతి న వాంఛంతి వ్యవహారం జగద్గతమ్।
సర్వమేవానువర్తంతే సారాసారవిదో జనాః॥

ఇట్టివారలే యుత్తమాధికారులు; గ్రహించిన దీక్షయందు సిద్ధినొందినపిమ్మట నాత్మానుభూతి కలుగును. అప్పటి భావము.

శ్రుతి:- "లోకో బ్రహ్మ గురుర్బ్రహ్మ శిష్యో బ్రహ్మ సదాశివః।
చైతన్యమాత్రమోంకారం బ్రహ్మైవ సకలం స్వయమ్॥"

చైతన్యమే ఓంకారము గాన సర్వమును జిచ్ఛక్తియే. శాక్తాద్వైతమందుఁ జిదన్వయమే లక్ష్యమగుటచే దానినే శ్రీశంకర భగవత్పాదాదులును బ్రతిష్ఠించిరి. వారు సర్వ స్వరూపులు.

శ్రుతి:- "అవిశేషేణ సర్వంతు యః పశ్యతి చిదన్వయాత్।
స ఏవ సాక్షాద్విజ్ఞానీ స శివస్స హరిర్విధిః॥"

శాక్తాద్వైతము సదసద్భావపూర్ణము. అట్టి భావమే బ్రహ్మభావము. సదసత్తుల రెండింటి నభిన్నాద్వైతదృష్టితోఁ గనువాఁడే యద్వైతిపదమును సార్థక మొనరించువాఁడు.

శ్రుతి:- "సాహం నచాన్యద స్తీహ బ్రహ్మైవాస్మి నిరామయం।
ఇత్థం సదసతోర్మధ్యే యఃపశ్యతి స పశ్యతి॥"

అష్టమీచంద్రసంకేతమే, దేవి సదసత్తత్త్వభావాత్మిక యని తెలుపు ముఖ్యవిశేషము. 'అష్టమీచంద్రవిభ్రాజదలికస్థలశోభితా' అనికదా రహస్యనామము. శివుఁడును అర్థేందుశేఖరుఁడే గదా. "సదసతోర్మధ్యే" అనుదాని సంకేతమే అష్టమీచంద్రశబ్దము. అమావాస్య యసద్భావము; పూర్ణిమ సద్భావము. మధ్యమభావము అష్టమీచంద్రభావము. పరివర్తన వివర్తన క్రమధర్మములవలన శుక్లకృష్ణపక్షములు రూపొందుచున్నవి. తిథిచంద్రుల కభిన్నభావసిద్ధి.

"తిథిశ్శరీరం తిథిరేవ కారణం
తిథిం వినా చాపి శశీ న దృశ్యతే." అనిరి.

సదసద్భావమధ్యమున సమతావస్థనుండి బ్రహ్మసాక్షాత్కారము నొందుచుండుటే దర్శనము. అందలి యవినాభావ సంబద్ధమగు స్వాత్మబ్రహ్మభావమే ద్రష్టవ్యమని శ్రుతియందు లక్షింపఁబడినది. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" అని శ్రుతి. అదియే పరాపరమగు నఖండాద్వైతశక్తిభావము. 'ఏకమేవాద్వితీయ' మనఁబడుచున్నదదియే. అదియే సర్వమును, పూర్ణమును, సమతావస్థాభావమునందు సాక్షి జ్ఞాత; జ్ఞాతృభావమే సమతావస్థాభావము.

దీని వివరణమును మద్గురువరేణ్యులు శ్రీ శ్రీయానందనాథులు వ్రాసిన "అమ్మతో ముచ్చటలు" అను గ్రంథమునకు నారచించిన "ఈంకారసమీక్ష"యందుఁ జూతకులు చూడఁగలరు. అట్టి ద్రష్టయే బ్రహ్మజ్ఞాని. "బృంహయతి సర్వ

మాచ్ఛాదయతీతి బ్రహ్మ" అనెడి బ్రహ్మశబ్దార్థాన్వయము యథార్థభావప్రతిపాదకము. అట్టి బ్రహ్మతత్త్వమునే శ్రుతి, 'చైతన్యం' అని దర్శించినది. బ్రహ్మభావమునకు మూలము బ్రహ్మశక్తియే. అది యంతరంగభావము. బహిరంగభావము న నదియే ప్రకృతి. అట్టి సర్వస్వరూపమగు భావమునే శక్తి యందురు. శాక్తమంత్రాగమ జిజ్ఞాసయందు 'చైతన్య స్వరూపా చిచ్ఛక్తిః' అనియును "సైవేయ మనామాఖ్యా శ్రీవిద్యా" అనియును "తత్త్వత్రయేణ సా వివిధా" అనియును శక్తినే బ్రహ్మతత్త్వమున కంతరంగముగ శక్తిమీమాంసా సూత్రములు ప్రతిష్ఠించుచున్నవి. సర్వభావ మాచైతన్య స్వరూపమే. తదన్యమునకు సిద్ధి లేదు.

శ్రుతులు:- 1. అవస్థాత్రయోపహితం అవస్థాత్రయోప లక్షితం చ నిరవస్థం విశుద్ధమేవ చైతన్యమ్. 2 చైతన్యం వినా కించిన్నాస్తీతి. 3 చిన్మాత్రస్వభావమాత్మైవ సర్వం బ్రహ్మ. 4 కిం జ్ఞానమితి-స్వప్రకాశకం జ్ఞానం, సర్వప్రకాశకం జ్ఞానం, నిరావరణ చిన్మాత్రం జ్ఞానం, అనాద్యనంతం, నిరంతరమువృత్తి వృత్తిసాక్షిచైతన్యమేవ జ్ఞానం. 5 కిమనంతమితి - ఉత్పత్తి వినాశరహితమనంతం, షడ్భావవికారరహితమనంతం, సర్వోపాధివినిర్ముక్తమనంతం, మృద్వికారేషు మృదివ స్వర్ణవికారేషు స్వర్ణమివ తంతువికారేషు తంతురివ అవ్యక్తాది సృష్టిప్రపంచేషు వ్యాప్య పూర్ణమవినాశి చైతన్యమనంతం. 6 చిదానంద రసైకమానందం. 7 శరీరమస్థిమాంసం చ త్యక్త్వా రక్తాద్య శోభనం। భూతముక్తావళీతంతుం చిన్మాత్ర ముపలోకయేత్॥ 8 చిత్తాకాశం చిదాకాశమాకాశం చ తృతీయకం। ద్వాభ్యాం శూన్యతరం విద్ధి చిదాకాశం మహామునే. 9 దేశాద్దేశాంతరం

ప్రాప్తౌ సంవిదో మధ్యమేవ తత్॥ నిమేషేణ చిదాకాశం తదిద్ధి మునిపుంగవ. 10 తస్మిన్నిరస్తనిశ్శేషసంకల్పస్థితిమేషి చేత్। సర్వావస్థాగతం శాన్తం తదా ప్రాప్నోష్యసంశయః. 11 నిర్వికల్పా చ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే। సా సర్వదా భవేద్యస్య స జీవన్ముక్త ఇష్యతే॥ 12 ప్రాప్యం సంప్రాప్యతే యేన భూయో యేన న శోచ్యతే। పరాయా నిర్వృతేః స్థానం యత్తజ్జీవితముచ్యతే. 13 గ్రాహ్యమితి చ-దేశకాలవస్తుపరిచ్ఛేదరాహిత్యచిన్మాత్రస్వరూపం గ్రాహ్యం. 14 సకారం చ హకారం చ జీవో జపతి సర్వదా। సోఽహం చిన్మాత్రమేవేతి చింతనం ధ్యానముచ్యతే. 15 అహం బ్రహ్మ న సందేహో హ్యహం బ్రహ్మ చిదాత్మకం। సచ్చిదానందమాత్రోఽహమితి నిశ్చయ తత్త్వజ. 16 అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవార్ణవే। అంతశ్శూన్యో బహిశ్శూన్యః శూన్యకుంభ ఇవాంబరే। సంశాంత సర్వసంకల్పా యా శిలావదవస్థితిః। జాగ్రన్నిద్రా వినిర్ముక్తా సా స్వరూపస్థితిః పరా॥''

స్థూలదృష్టియందు శిల నిశ్చలముగఁ గన్పట్టును. కాని చైతన్యమందుఁ బ్రకారత్రయాత్మకమై ప్రత్యేక శిలాణువు నందును స్పందించుచునే యుండును. అనఁగాఁ బ్రశాంతమగు భావమును శిలావదవస్థితియందును గని గ్రహింపవలయును. పృథ్వీభావమందలి పరిణామదశలలో మొదటిది శిలయే కాన, నిదియే సుప్రయుక్తమగు నుదాహరణము. ఇదియే స్థాణు తత్త్వము. శిలావిగ్రహప్రతిష్ఠారహస్యమందలి గుప్తార్థమిదియే.

''అసంశయవతాం ముక్తిః సంశయావిష్టచేతసాం।
న ముక్తిర్జన్మజన్మాంతే తస్మాద్విశ్వాసమాప్నుయాత్॥

ఇట్టి చిచ్ఛక్తియే బ్రహ్మభావమని శ్రుతులుపదేశించు చున్నవి. సర్వమును చైతన్యస్వరూపిణి యగు శక్తి; తదన్యమునకు సిద్ధి లేదు. అదియే యద్వైతసారము; అదియే శాక్తాద్వైతము; అట్టి తత్త్వమునే సౌందర్యలహరియందు శ్రీశంకరులు "మహామాయే విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి" అని మహామాయాత్మకమగు బ్రహ్మభావమును అఖండైకభావమున నభివ్యక్తమొనరించిరి. ఇచట "భ్రమయసి=చైతన్యవంతముగఁ జేయుచున్నావు. సర్వవేదాంతసిద్ధాంతసార మగునట్టి శాక్తాద్వైతమే యాశక్తినుపాసించుటకును దమ్మాలమునఁదరించుటకును నేకైకమార్గము. కనుక నే శ్రీభగవత్పాదులు తమ యఖండాద్వైతమతస్థాపనమందు సర్వపీఠములందును శక్తిని బ్రతిష్ఠించి వానిని శక్తివంతములుగఁ జేసిరి. పీఠాధిపతుల నందఱను శక్త్యర్చనా నియమధురంధరులఁగాఁ జేసిరి. శ్రీ శంకరభగవత్పాదుల యనుశాసనములగు మతామ్నాయ సంప్రదాయ నిర్వచనములే వీనికిఁ బ్రమాణములు. ఉదా:- 'పశ్చిమే శాళికాపీఠం' మొదలగునవి. శ్రీ శంకరాచార్య స్వామరమగు కామకోష్ఠమునందు "పరాశక్తేః పరం స్థానం" అని అనుశాసింపఁబడి యున్నది. ఈ జగద్గురుని విశ్వాసముం జూడుఁడు.

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరా యాసంవిదుజ్జృంభతే
యా బ్రహ్మాదిపిపీలికాంతతనుషు ప్రోతా జగత్సాక్షిణీ
సైవాహం న చ దృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తిచేత్
చండాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ॥

ఇందలి 'ప్రజ్ఞా' శబ్దమునకు లక్ష్యము— 'నిర్వికల్పా చ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే' (శ్రుతి)

శ్రీ శంకరాచార్యులకు జీవభ్రమ యొక లేశముండిన సమయమునఁ దన్నివారణార్థము కరుణామూర్తియగు శంకరుఁడు చండాలవేషమున సమీపించెనట. అపు డాచార్యుల వారు 'ఓ చండాలా! దూరముగానుండు' మనిరట. అంతటఁ జండాలరూపధారియగు శంకరుఁడు ఆ చార్యశంకరుని జూచి—

"కిం గంగాంబుని బింబితేంబరమణౌ చండాలవీథీపయః
పూరేవాంతరమస్తి కాంచనఘటీమృత్కుంభయోర్వాంబరే।
ప్రత్యగ్వస్తుని నిస్తరంగ సహజానందావబోధాంబుధౌ
విప్రోఽయం శ్వపచోఽయమిత్యపి మహాన్ కోఽయం విభేదభ్రమః॥
— మనీషాపంచకము.

అని పలికెనఁట. అప్పటికే యణిమాదిసిద్ధిసంపన్నులై యుండిన యాచార్యులు, ఆచండాలశంకరు డాదిశంకరుఁడుగ నెఱింగి పై శ్లోకరూపమునఁదమ విశ్వాసమును బ్రకటించిరట. ఇది సాహసికుల పాఠమనువారును లేకపోలేదు. గాని వారిది నిరర్థకవాదము. చండాలత్వద్విజత్వాదిభ్రమ ముండునంతవఱకును జీవభ్రాంతి వదలదు. భగవత్పాదులు జీవభ్రాంతియుతులు కాఁజాలరు. శ్రీభగవత్పూజ్యపాదాదివిశేషణములను శంకరుల యెడల నంగీకరించువారు దీనిని విశ్వసింపక తప్పదు. శ్రుతి:— కులగోత్రజాతివర్ణాశ్రమరూపాణి మద్భ్రమాః। ఏతద్యోగేన పరమపురుషో జీవో భవతి॥ అట్టి సామాన్య జీవులకంటె విలక్షణులగు శ్రీ శంకరాచార్యుల విశ్వాస మాశ్లోకార్థమునై తమనఁగ సందేహము లేదు.

"భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా
పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమర కీటవత్॥
అదృశ్యం భావరూపం చ సర్వమేవ చిదాత్మకమ్,
సావధానతయా నిత్యం స్వాత్మానం భావయేద్బుధః॥

దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చింతయేత్
విద్వాన్ నిత్యసుఖే తిష్ఠేత్ ధియా చిద్రసపూర్ణయా॥

ఇవి యపరోక్షానుభూతి నొందుటకు సాధకులకై శ్రీ శంకరభగవత్పాదు లుపదేశించినవి.

శ్రుతి:- యే హి వృత్తిం విహాయైనాం బ్రహ్మాఖ్యాం పావనీం పరాం
వృథైవ తే తు జీవంతి పశుభిశ్చ సమా నరాః,
యే తు వృత్తిం విజానంతి జ్ఞాత్వా వై వర్ధయంతి యే,
తే వై సత్పురుషా ధన్యా వంద్యాస్తే భువనత్రయే॥

" My religion consists of a humble admivation of the illimitable superior spirit, who reveals himself, in the slight details, we are able to perceive, with our frail and feeble minds. That deeply emotional conviction of the presence of a superior reasoning power, which is revealed in the incomprehensible universe, forms my idea of God. The cosmic religious experience is the strongest and noblest main-spring of scientific research. The most beautiful and most profound emotion, we can experience is, the sensation of the mystical, It is the sower of all true science. He to whom, this emotion is a stranger, who can no longer, wonder and stand rapt in awe, is as good as dead. To know that what is impenetrable to us really exists, manifesting itself as the highest wisdom and the most radiant beauty which our dull faculties can comprehend only in their most primitive forms — This knowledge, this feeling is at the centre of true religiousness, (Dr. Einstein).

ఓం బం నమః

శ్రీ మహాశాక్త్యై నమః
శ్రీ శ్రీయానందనాథగురవే నమః

# నేనెవరు?

## ద్వితీయ పటలము

శ్రుతి:- ఏకమేవాద్వితీయం బ్రహ్మ (ఋగ్వేదము) అహం బ్రహ్మాస్మి (యజుర్వేదము) తత్త్వమసి (సామవేదము) యజ్ఞేన వాచః పదవీయమాయన్। తామన్వవిందన్ ఋషిషు ప్రవిష్టామ్। తామాభృత్యా వ్యదధుః। పురుత్రా, తాం సప్తరేభా అభిసన్నవంతే॥'' సంస్కృతవాణి ప్రప్రథమమున మంత్రములందు మాత్రమే కలదు. మంత్రవేత్తలగు మహర్షులు మంత్రబలముచే మంత్రమూర్తులై వేదముల నెఱింగి ప్రచురించిరి. పిమ్మట వేదసమనుశీలనమువలన ఋష్యాదులు సంస్కృతవాణిని ప్రచురించిరి. వేదములకంటెను పూర్వము మంత్రశాస్త్రమే కలదు.

జ్ఞానమువలన కర్మతత్త్వ మెఱుంగబడును. అట్టి తత్త్వజ్ఞాని కర్మము నాచరించి జ్ఞానానుభూతి నొందును. అట్టి యనుభూతి సాధ్యము. కర్మము సాధనము.

శ్రుతి:- అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే
ప్రతిబింబిత శాఖాగ్రఫలాస్వాదనమోదవత్॥

న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥ (గీత)

"ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్పవివర్జితమ్,
జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవివర్జితమ్॥"

కర్మము నాచరింపనిదే నైష్కర్మ్యసిద్ధి కలుగదు. పుష్పము లేక ఫలము పుట్టదు. ఫలము గలిగిన వెనుకఁ బుష్పము తానే రాలిపోవును. ఉపాసనమువలన జ్ఞానానుభూతి కలుగును అప్పుడు ఉపాసకుఁడు ఉపాస్యదేవతా తాదాత్మ్యము నొందును. అనఁగా నద్వైతసిద్ధి కలుగును. పిమ్మట విధినిషేధ విభేదసహితమగు కర్మల నాచరించుచుండక స్వేచ్ఛాతంత్రుఁడై స్వయంజ్యోతియై భాసిల్లుచుండును. ఆత్మానుభూతియును గర్మమే యనవచ్చునుగాక. అయినను అభేదభావనము గల చోటఁ గర్మ మఖండైకభావమున నుండును. భిన్నదృష్టికిని విధినిషేధములకును దావు లేక, సర్వస్వరూపమై భాసించుచుండునట్టి కర్మభావమును, సామాన్యకర్మ సూత్రములును ధర్మసూత్రములును బాధింపఁజాలవు. "జీవోఽహం" అను భ్రమముండదు. కాన, నది సామాన్య కర్మపదలక్షితము కాదు. కర్మమన నేమియో శ్రుతిప్రమాణముం జూతుఁడు— "కర్మేతి చ॥ క్రియమాణేంద్రియైః కర్మాణ్యహం కరోమీత్యధ్యాత్మ నిష్ఠతయా కృతం కర్మైవ కర్మ."

ఇన్ని మాటలేల? జీవభ్రాంతి కలవారు కర్మఫలాభిసంధానముఁ జేయుదురు. జ్ఞానులటులు చేయరు. ఇరువురును గర్మల నాచరింతురు. వారి వారి భావముల కనుగుణముగ నొకరికి బంధమును, నొకరికి ముక్తియును గలుగును. జీవభ్రాంతులు ఫలాపేక్షతోఁ జేయు కర్మము, జ్ఞానుల కకర్మము. జ్ఞానుల నుద్దేశించి యకర్మమునుగూర్చి శ్రుతి యేమనెనో చూతుఁడు.— "అకర్మేతి చ॥ కర్తృత్వ భోక్తృత్వా

ద్యహంకారతయా బంధరూపం, జన్మాది కారణం, నిత్య నైమిత్తిక యాగవ్రతతపోదానాదిషు ఫలాభిసంధానం యత్ తదకర్మ." జ్ఞాని యగువాఁడు శాంతుఁడు.

శ్రుతి:- శ్రుత్వా స్పృష్ట్వా చ భుక్త్వా చ దృష్ట్వా జ్ఞాత్వా శుభాశుభం
న హృష్యతి గ్లాయతి యస్సశాంత ఇతి కథ్యతే॥

శ్రుతి:- జీవస్య తత్త్వజిజ్ఞాసా నార్థో యశ్చేహ కర్మభిః॥
అథాతో బ్రహ్మజిజ్ఞాసా॥

ఇచట "అథః" అనఁగా "అర్థ్యతే ప్రాప్యతే కర్మఫల మిత్యర్థః" అని సమన్వయము. దీనికి మున్నుల్లేఖింపఁబడిన శ్రుతి నిర్వచించిన తత్త్వముగల శాంతుఁ డెవఁడో వాని నే కర్మఫల మంటదు. అట్టిఁడే బ్రహ్మజిజ్ఞాసకర్హుఁడని యర్థము. ఆత్మశాంతి కలుగు పర్యంతము కర్మజిజ్ఞాసను జేయవలసినదే. ఫలాపేక్ష లేని కర్మాచరణముననే యట్టి శాంతి లభించును.

కర్మతత్త్వము నుపదేశించునది క్రియానిష్ఠమగు యజుర్వేదము. అందు "అహం బ్రహ్మాస్మి" యను మంత్రముప దేశింపఁబడినది. అస్మచ్ఛబ్దమువలన నేభావము జ్ఞానియందు స్వాభివ్యక్తమగుచుండునో, యదియే బ్రహ్మభావము. జ్ఞానానుభూతి యుపాసనమువలనఁ గలుగును. పిదప జ్ఞాననిష్ఠమగు ఋగ్వేదమందు అస్మత్ శబ్ద మేభావమువలన స్వాభివ్యక్తమగుచున్నదో, యాభావమే తానై యుపాసకుఁడు కేవల భావమున భాసించుచుండును. అదియే కైవల్యము. ఋగ్వేద మంటు అస్మచ్ఛబ్దభావమిట్లు స్వాభివ్యక్తమగుచున్నది.

ఋగ్వేదము 10, మంత్రము 125.

అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహమాదిత్యైరుత విశ్వదేవైః।
అహం మిత్రావరుణోభా బిభర్మ్యహమింద్రాగ్నీ అహమశ్వినోభా॥

అహం సోమమాహనసం బిభర్మ్యహం త్వష్టారముత పూషణం భగమ్।
అహం దధామి ద్రవిణం హవిష్మతే సప్రావ్యే యజమానాయ సున్వతే॥
అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానామ్।
తాం మా దేవా వ్యదధుః పురుత్రా భూరిస్థాత్రాం భూర్యావేశయంతీమ్॥
మయా సోఽన్నమత్తి యో విపశ్యతి యః ప్రాణితి య ఈం శృణోత్యుక్తమ్।
అమంతవో మాం త ఉపక్షియంతి శ్రుధి శ్రుత శ్రద్ధివం తే వదామి॥
అహమేవ స్వయమిదం వదామి జుష్టం దేవేభిరుత మానుషేభిః।
యం కామయే తం తముగ్రం కృణోమి తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధామ్॥
అహం రుద్రాయ ధనురాతనోమి బ్రహ్మద్విషే శరవే హంతవా ఉ
అహం జనాయ సమదం కృణోమ్యహం ద్యావాపృథివీ ఆవివేశ॥
అహం సువే పితరమస్య మూర్ధన్మమ యోనిరప్స్వంతః సముద్రే
తతో వితిష్ఠే భువనాను విశ్వోతామూం ద్యాం వర్ష్మణోపస్పృశామి।
అహమేవ వాత ఇవ ప్రవామ్యారభమాణా భువనాని విశ్వా
పరో దివా పర ఏనా పృథివ్యైతావతీ మహినా సంబభూవ॥

దీనిని దేవీసూక్తమందురు. శ్రీపద్గురుదేవులు శ్రీ శ్రీరామానందనాథ దీక్షానాములు రచించిన శ్రీ దేవీసూక్త పరమార్థమునందు దీని విపులవివరణమును జూచునది, యని మనవిఁ జేయుచున్నాను. ప్రతి శబ్దమునకును నిగమార్థము, ఆగమార్థము, రహస్యార్థము, సంకేతార్థము, రూఢ్యర్థము, యోగికార్థము, తత్త్వార్థము అని యేడు విధములగు నర్థము లుండును. ఆయా సందర్భవిశేషముల ననుసరించి ఆయా పదార్థముల నెఱుంగవలయును. అందులకు ముఖ్యాంగము వ్యాకరణము. అదియును ప్రకారత్రయాత్మకమగుటవలన మూఁడు విధములుగ నున్నది.

శబ్దానాం చ త్రిధా భేదో లౌకికో వైదిక స్తథా,
ధ్వనిశ్చైవం తృతీయస్స్యాత్ తయోస్సంబంధ రూపవాన్॥

ఓం జం నమః

శ్రీనృసింహాసరస్వత్యై నమః
శ్రీ శ్రీయానందనాథగురవే నమః

# నేనెవరు?

## తృతీయ పటలము

వేదములు ఋగ్యజుస్సామాథర్వములని నాలుగు. దేవీసూక్తము ఋగ్వేదములోనిది. "ఋచ్యతే జ్ఞాయతే ఇతి ఋక్" అని ఋక్పదార్థము. బ్రహ్మతత్త్వము దీని వలన నెఱుంగఁబడును. ఋగ్వేదసంహిత ఋగ్వేదోక్తబ్రహ్మతత్త్వమును సర్వమును సంక్షిప్తముగ నెఱిఁగించును. "ఋచ్యతే జ్ఞాయతే బ్రహ్మతత్త్వం సర్వం సంక్షిప్తం యయా సా ఋగ్వేదసంహితా" అని యార్ష సమన్వయము. ఇదియే ఋగ్వేదసంహితాపదార్థము. కావున ఋగ్వేదము బ్రహ్మతత్త్వజ్ఞానార్థమే ప్రవర్తితమైనదని యెఱుంగునది. ఈ సందర్భమునఁ దక్కు వేదములను గుఱించియు నింత ప్రస్తావించు టావశ్యకము. శ్రుతి:–అనంతా వై వేదాః – వేదములనంతములు. వానిలో మానవుల కావశ్యకములైనవి పై నాలుగు వేదములే యని తెలియుచున్నది. "వేత్తి వేదయతీతి వా వేదః", ఇది వేదపదార్థము. పదార్థములందు మహర్షి నిరుక్తసిద్ధపదార్థములే గ్రహింపఁబడుచున్నవి.

యజుర్వేదము:— "యజతే క్రియతే బ్రహ్మతత్త్వాభాసనం సంక్షిప్తం యత్ర ఇతి యజుర్వేదః" "యజనం క్రియతే సర్వమితి యజుః" అని పదార్థవివరణము.

సామవేదము:— "సామ్యతే ఇష్యతే జ్ఞానక్రియా ఇతి సామ" అని పదార్థవివరణము.

అధర్వవేదము:— అర్థ్యతే ప్రాప్యతే బ్రహ్మతత్త్వమేతత్త్రియఫలమిత్యధర్వవేదః అని పదార్థవివరణము. అధర్వవేదమున కంగములుగ బ్రహ్మచేఁ బంచోపవేదములు సృష్టములైనవి. (1) సర్పవేదము (2) పిశాచవేదము (3) అసురవేదము (4) ఇతిహాసవేదము (5) పురాణవేదము. ఇదియునుంగాక గంధర్వవేదము, ధనుర్వేదము, ఆయుర్వేదము; వేఱొక యధర్వాణవేదమును గలవని తెలియుచున్నది.

వేదమునందు ముఖ్యముగ, మంత్రములు బ్రాహ్మణములు ఉపనిషత్తులునని త్రైవిధ్యము కలదు. వానియందు మంత్రము జ్ఞానప్రవచనపరము. బ్రాహ్మణము క్రియాప్రవచనపరము. ఉపనిషత్తు ఇచ్ఛాప్రవచనపరము, జ్ఞానక్రియాత్మకములగు మంత్రబ్రాహ్మణములను సమాహరించి ప్రవచించునది యుపనిషత్తు. కావుననే సర్వమతములను శ్రుతిప్రమాణములు ఉపనిషత్తులనుండి ముఖ్యముగ గ్రహింపఁబడుచున్నవి. అందును మంత్రము సంహితారూపము. "సంహీయంతే సంక్షీయంతే సర్వమస్మిన్నితి సంహితా" అని పదార్థవివరణము. ఋగ్వేదము జ్ఞానప్రవచనపరము. యజుర్వేదము క్రియాప్రవచనపరము. సామవేద మిచ్ఛాప్రవచనపరము. అధర్వవేదము ఋగ్యజుస్సామవేదములకు మూఁటికిని నేకబీజత్వమున సమాహారప్రవచనపరమైనది. అందువలన ఋగ్యజుస్సామవేదముల నేకబీజత్వమున సమన్వయించుకొనుటకై, యధర్వవేదమును దానియందలి సమాహృతప్రవచనతత్త్వముల నెఱుంగుటకై తక్కిన మూఁడు వేదములను నెఱుంగవలయును.

ఈ వేదముల సంబంధ మవినాభావమైనట్టిది. అథర్వ వేదముంబోలి మంత్రబ్రాహ్మణోపనిషత్తుల నేకబీజమున సమాహరించి ప్రవచించునది తంత్రము. మంత్రబ్రాహ్మణోపనిషత్తంత్రములందుఁ బ్రత్యేకముగ, నొక్కొక్క-దానియందు నాలుగు క్రమములును, మఱల వానియందుఁ బ్రత్యేకక్రమ భేదములును నుండుటచే ననంతఫలము గలుగుచున్నది. "మంత్రబ్రాహ్మణోపనిషత్తంత్రాణాం చతుర్ణామపి ప్రత్యేకం చత్వారో భేదాస్సంభవంతీత్యనంత ఫలం భవతి" అని మహర్షుల నిర్ణయము.

జ్ఞానము స్మరణాదివ్యాపారము; ఇచ్ఛ కామనాదివ్యాపారము; క్రియ కర్తృకరణవ్యాపారము; కేవలవేదశబ్దార్థమును మాత్రమే గ్రహింపవలసినచో, వేదము జ్ఞాననిష్ఠమన వలయును. వేదమును బ్రహ్మనిష్ఠమనియు ననవలయును.

"జ్ఞాననిష్ఠో భవేద్విష్ణుః క్రియానిష్ఠః ప్రజాపతిః
ఇచ్ఛానిష్ఠశ్శివస్సాక్షాత్ మహావిష్ణుస్సమాహృతః॥"

అని ప్రవచనము. కావుననే విష్ణువునుండి ఋగ్వేదమును, బ్రహ్మనుండి యజుర్వేదమును, శివునుండి సామవేదమును మహావిష్ణువునుండి యథర్వవేదమును జనించినవి

"కృతయుగం జ్ఞాననిష్ఠం తు త్రేతా చైవ క్రియాపరా।
ద్వాపరం కామనారూపం సమాహారః కలిర్భవేత్॥

అని ప్రవచనము. కావునఁ గలియుగమున విశేషించి యథర్వవేదమును దంత్రమును బ్రామాణికములు. అంతకు మించిన శరణ్యముగాని, తరణోపాయముగాని, యుగధర్మమునుబట్టి వేఱొకటి లేదు. యుగధర్మములును నైసర్గికములు కదా; అవి స్వాభావికములగుటచే దురతిక్రమములు.

జేపీసూక్తాదుల పారాయణము, తంత్రోక్తవిద్యాంగ రూపమున జరుగుట సమంజసమే. ముఖ్యాంగము తంత్రవిద్యమైనపుడు, తక్కిన మూ నుసు సుపాంగవిద్యలగును. వాని సంబంధ మవినాభావాత్మకమగుటవలన నది యనివార్యము అట్టి తంత్రవిద్యాపారంగతులగువారి కీయుగమునఁ దద్ధర్మము ననుసరించి ధర్మార్థకామమోక్షములు యథాయోగ్యముగ సాధ్యములు. ప్రాకృతమగు కాలస్వభావము నతిక్రమింపఁ దరము కాదు. దేశకాలపాత్రముల ననుసరించి ప్రాకృతికము లగు ధర్మములు పరిణామశీలములగుటచేఁ గాలాదుల కనుగుణ మగు సిద్ధాంతములవలననే సర్వమును సాధించుట సంభవము. ముత్తాతగారి గొప్పదనమునకును ముత్తాతగారి కాలమునకును నవినాభావసంబంధము గలదు. మునిమనుమఁడు తన కాలము నందలి నైసర్గిక పరిణామము నెఱింగి యుచితమార్గముననే యన్వేషించి సిద్ధి నొందవలయును. గత్యంతరము లేదు. 'స్వభావో దురతిక్రమః' అను న్యాయమిచట ననుసంధేయము.

అక్షరములయందలి మొదటి మూఁడింటినుండియే సర్వ వర్ణములును జనించినవి. వేదములకును నివియే బీజములు "ఏతైర్వర్ణైస్త్రిభిశ్చైవ స్వరాస్సర్వే భవంతి చ" అని ప్రవచనము. పరివర్తనక్రమమున స్వరము లనంతములగుచున్నవి. "అనంతాశ్చ స్వరాఃసర్వే సర్వాతీతా స్సనాతనాః" అని ప్రవచనము. ఈస్వరముల పరివర్తనక్రమమువలన వ్యంజనములును జనించినవి. అందువలననే "వ్యజ్యతేఽన్యైః నామ స్వరైః తద్వ్యంజనమ్" అని ఆర్షాన్వయము. ఈమూఁడు స్వరములవలననే త్రిశక్తులును త్రిగుణములును, మూఁడింటి సమా

హారమువలన నాల్గుపతత్త్వమును, వానియందలి ప్రకారత్రయ నియమమువలన సర్వజగత్తును బ్రహ్మత్తమైనది. ఈతత్త్వ రహస్యమును వివరించుచు మహర్షులు.

"అథాతస్త్రిగుణాత్మకః సంసార ఇత్యుచ్యతే। సత్వం రజస్తమశ్చేతి గుణా భవంతి। తాదృశజ్ఞానేచ్ఛాక్రియాక్రమ నియమేన గుణా వేదితవ్యా భవంతి। సత్వం హి కిల జ్ఞానం। రజశ్చ క్రియా।తమశ్చేచ్ఛా।త్రయాణాం సమాహారశ్చతుర్థః। అత ఏవ ప్రకారత్రయేణ సర్వంజగత్॥" ఇత్యుక్తం। అస్య షోడశమండలాని విహితాని సంతి। నియమేన చతుర్వింశతి మండలాని సంతి। సమాహారాంతర్గతం మండలాష్టకం।ఇచ్ఛానిష్ఠత్వాత్ షోడశేన ప్రవచనమ్॥" అని నిర్ణయించియున్నారు.

శ్రీచక్రరహస్యమంతయు నిందిమిడియున్నది. పిండాండ బ్రహ్మాండముల రహస్యమంతయు నీప్రకారత్రయసిద్ధాంతముపై నాధారపడి యున్నది. ప్రకారత్రయాత్మకమగు జగత్తే శ్రీచక్ర సంజ్ఞకము. చతుర్వింశతి మండలములవలనఁ జతుర్వింశతి సంధులు. చతుర్వింశతిమండలాత్మకమే బ్రహ్మగాయత్రి. షోడశ మండలాత్మకమే షోడశీవిద్య. షోడశచంద్రకళలు మండలాష్టకాత్మకమే యష్టవర్గాతమగు దేవీతత్త్వము. ప్రకారత్రయాత్మకమే త్రికోణచక్రము. అది శ్రీచక్రత్రికోణములందు మధ్యనున్నట్టిది. దానివలనఁగలిగిన ప్రకారత్రయ నియమము వలనఁ బదునెన్మిది మర్మములును, నిరువదినాలుగు సంధులును, జనించుచున్నవి. కావుననే మూలత్రికోణమువలన (18+24=42) కోణములును జనించినవి. కనుకనే మూలత్రికోణముఁగలసి శ్రీచక్రమునందు మొత్తము 43 కోణము

లయ్యెను. మూలత్రికోణమే ప్రధానప్రకృతి. అదిగాక త్రికోణ
నాలుగు శక్తిచక్రములును బకృతి. నాలుగు శివచక్రములును
బురుషప్రకృతి. ఈ రెంటనుంగలియంగా నెనిమిది చక్రము
లగును. అట్టి తత్త్వమే యష్టవర్గాత్మకమగు దేవీతత్త్వము.
ప్రధానప్రకృతి, పురుషప్రకృతి ప్రకృతుల నఖండముగా
నెంచగా నేర్పడు తొమ్మిది చక్రములే బ్రహ్మభావము. శబ్ద
బ్రహ్మమునకుం దొమ్మిదియే సంఖ్యానియమము. అన్నింటికిని
బ్రధానబ్రకృతియగు త్రికోణశక్తియే కారణము. గాన సర్వ
మును శాక్తమే. ఈతొమ్మిదిచక్రములకును దానివలన జనిం
చెడి పదునెన్మిది మర్మములకును 24 సంధులకును 43 కోణము
లకును సర్వమునకును నఖండాద్వైతసిద్ధి యనెడి సంజ్ఞయే
బిందువు. ప్రధాన ప్రకృతి తత్త్వత్రయ సమాహారాత్మిక.
మూలప్రకృతితత్త్వస్వాభివ్యక్తబీజసంజ్ఞయే బిందువు. అనంగా
మూలప్రకృతియే బిందుసంజ్ఞికము. మూలప్రకృతియే బ్రహ్మ
శక్తి యగుటవలన సర్వమును శాక్తమే. తదన్యమునకుం
బూర్ణాధికారమున సిద్ధిలేదు. అధికారివిభేదమునకనుసరించి సిద్ధి
యుండవచ్చును. సర్వవేదములును నీబీజభావమునకుం గీలక
భావమున నఖండాద్వైతభావమును బొందియున్నవి. సర్వ
తంత్రస్వతంత్రులగు గురుదేవులవలన నుపదేశింపంబడంచగినది
యీతత్త్వగర్భితరహస్యార్థము. వృక్షరహస్యము, దానవలనం
బుట్టెడు దాని బీజమందిమిడి యుండునట్లు సర్వవేదరహస్యము
నిందిమిడియున్నది.

ఋక్కులవలన నా ఋక్కులు ప్రతిపాదించెడి జ్ఞానము
కలుగును. జ్ఞానమే సర్వసిద్ధికారణము. దేవీసూక్తమందు
స్తోత్రరూపాత్మకమగు జ్ఞానము కలదు. అది యాత్మస్తోత్రా

త్మకముగ నున్నది. ఇట్టి ఋక్కుల నర్థము చేసికొనుటకు సంహితలయందలి యంతరార్థబోధకములగు ప్రవచనములను గూడ సమన్వయించుకొనుటవలనఁ దత్త్వబోధము దృఢమగును. దేవీతత్త్వముతోఁ దాదాత్మ్యము నొంది దేవీమూర్తియైన బ్రహ్మవిదుషి అమ్భృణి - వాక్ అను నామె వచించిన యపౌరుషేయ వాఙ్మయ మీ దేవీసూక్తము. తత్త్వజిజ్ఞాసాసిద్ధులు తాదాత్మ్యసిద్ధినొంది యఖండాద్వైతభావమున నుందురు. కావున వారాత్మస్తోత్రముఁ జేయుచో నది యుపాస్యదేవతోపాసకాత్మైక్యానుసంధానమునకు బలముఁ గూర్చును. గాని ఆత్మప్రశంసాకలుషితము కాఁజాలదు. ద్వైతభావమును భేదబుద్ధియుఁ గల యాత్మప్రశంసయే నింద్యము. అట్టి సామాన్యమానవధర్మములనే ధర్మసూత్రములు విశేషించి నిర్వచించుచున్నవి. "ఆత్మప్రశంసాం పరగర్హామివ వర్జయేత్ (ఆ-ధ-సూ-) ఇట్టి వానిచే దేవీసూక్తాదులు లక్షితములు కావు. స్తోత్రమువలన దేవతాత్మైక్యసిద్ధికి బలము కలుగును. అట్టి స్తోత్రములందు స్వాత్మస్తోత్రమన్నింటి కంటె బలీయమైనది. అది స్వహృదయార్చనాంగము. స్వహృదయార్చనాంతర్గతమే స్వాత్మస్తోత్రము. బాహ్యార్చనమునఁ ద్వైతసిద్ధియును బునర్భవమును గలుగును. స్వహృదయార్చనము వలన నద్వైతసిద్ధియును అపునర్భవమును గలుగును.

పాషాణలోహమణి మృణ్మయ విగ్రహేషు
పూజాపునర్జనన భోగకరీ ముముక్షోః।
తస్మాద్యతిః స్వహృదయార్చనమేవ కుర్యాద్
బాహ్యార్చనం పరిహరేదపునర్భవాయ॥ — (మైత్రేయోపనిషత్తు)

10

బాహ్యపూజా న కర్తవ్యా కర్తవ్యా హృజ్జాతిభిః
సా క్షుద్రఫలదా నౄణాం ఐహికార్థైకసాధనాత్ ।
అంతరాసధనపరా వైదికా బ్రహ్మవాదినః
జీవన్ముక్తాశ్చరంత్యేతే త్రిషులోకేషు సర్వతః॥
— సనత్కుమార సంహిత.

అట్టి స్వహృదయార్చనమునందు స్తోత్రాదులవలన నుపా సకునికంటె వేఱు కాని యుపాసకహృదయాంతర్గతతత్త్వము వివర్ధనమంది, తుద కుపాసనాసిద్ధ్యనంతరము ఉపాసకుఁడే యుపాస్యదేవతాభావముతో భాసించును. (శ్రుతి:- "స్తూయమానా హి దేవతా వీర్యేణ వివర్ధతే" "దేవతా కాశ్శరీరం చ బీజాదుత్పద్యతే శివే" (శ్రీ) లలితా రహస్యనామములందు 71 వది. "జ్వాలామాలినికాక్షిప్తవహ్నిప్రాకారమధ్యగా" ఈ నామక్రమ సంఖ్యారహస్యము అష్టవర్గోత్థమగు జీవితత్త్వమును సంఖ్యాసామరస్యభావమునలక్షించుచున్నది. స్వదేహాంతర్గతనాడీ మర్మసంధిస్థానయుక్తమునగు నీ రహస్యనామాత్మకమగు (శ్రీ)చక్ర మెటులు పరిలిఖింపఁబడియున్నదో యెఱింగి, పరాహంభావమున నర్చించుటవలనఁ బునరావృత్తిరహితమగు తాదాత్మ్యపూర్వక విదేహకైవల్యముక్తి సిద్ధించును. అదియే బ్రహ్మైక్యసిద్ధి. తాదాత్మ్యభావమే జీవాత్మ పరమాత్మల సమతావస్థ.

ఉపాస్యదేవతల బలప్రాబల్యములు స్తుత్యాహుతుల కధీనములు. స్వహృదయార్చనమున నుపాసకుఁడు చేయు భోజనాది సర్వకార్యములును ఆహుత్యాది సర్వోపచారములుగ నగును. స్తుత్యాహుతులు మంత్రాధీనములు. మంత్రములు వాగాత్మకములు. కావున సర్వమును వాగధీనము.

తాదాత్మ్యసిద్ధినొంది మంత్రమూర్తియై భాసించిన బ్రహ్మ విదుషియగు 'వాక్' అను నామెనుండి స్వాభివ్యక్తమగుటచే నీ దేవీసూక్త మహోపదేశము. శ్రుతులన నిట్టివే. ఇది ఋగ్వేదాంతర్గతము.

దేవీసూక్తమును శ్రీదేవీసూక్తమనుటయును సుప్రయోగమే. 'శాగ్ని శాంతి బిందు నాదైర్లక్ష్మీప్రణవ ఉచ్యతే' అని బీజసంకేతబోధయందును —

"మహాలక్ష్మ్యర్థకః శః స్యాత్ ధనార్థో రేఫ ఉచ్యతే।
ఈస్తుష్ట్యర్థో పరో నాదో బిందుర్దుఃఖహారకః।
లక్ష్మీదేవ్యా బీజమేతత్ తేన దేవీం ప్రపూజయేత్॥"

అని మంత్రార్థకథనమందును గలదు. బ్రహ్మభావమునో మఱియొక పదార్థమునో బోధించెడి శబ్దముయొక్క లింగానుశాసనము ననుసరించియే యాశబ్దముచేఁ బ్రతిపాదితమగు తత్త్వముయొక్క స్త్రీపుం నపుంసకభేద ముండవలసిన విధి సంస్కృతవాణియందు లేదు. ఉదాహరణముగ భార్యయను నర్థము గల యీపదముల లింగానుశాసనమును జూడుడు, జాయా - స్త్రీలింగము; దారా - పుంలింగము; కళత్రమ్ - నపుంసకలింగము. లింగానుశాసనమెట్టిదైనను ఈ మూఁడు పదములును స్త్రీయగు భార్య నుద్దేశించియే ప్రవర్తించుచున్నవి. కావున బ్రహ్మ - దేవి మొదలగు శబ్దములచే నిర్దేశింపఁబడు తత్త్వములు, వాని లింగానుశాసనముల కనుగుణములగు లైంగికభావమును గలిగియుండవలసిన యావశ్యకత లేదు. వాని వృత్తిననుసరించి వానివాని భావము తెఱుంగవలయును. పరివర్తన వివర్తనాది క్రమభావము ననుసరించి యెఱుంగవలయు ననుట యంతకంటెను యుక్తము. లింగానుశాసనము

వలన శబ్దవృత్తియందలి ధర్మము నెఱుఁగవచ్చును. అదియు నొక ధర్మము. ఆ ధర్మమువలన నా శబ్దమునందలి జ్ఞానేచ్ఛా క్రియాది భావములందలి ప్రత్యేక ప్రకృతి నెఱుంగనగును. 'శబ్దో ధర్మః' అనియు, 'ధర్మార్థకామాపవర్గాః' అనియును సూత్రములు. అసలు శబ్దమే భావధర్మము. అదియునుంగాక తత్త్వార్థబోధకోఱకు, శబ్దములందలి యక్షరభావ సంకేతము లగు వర్ణముల వర్ణనమువల్లను, వర్ణపద సంయోగక్రమము వల్లను దత్తచ్ఛబ్దప్రతిపాదితభావము నెఱుంగనగును. 'జ్ఞానం ఛందసి' అని సూత్రము. అట్టి శబ్దమువలన సర్వము నెఱుంగ నగును. 'జ్ఞానాధారః' అనియును, 'శబ్దస్సర్వః' అనియును, 'సర్వార్థః'అనియును, 'నిత్యః' అనియును, 'తంత్రః' అనియును సూత్రములు. అట్లుగాక దీనికి స్త్రీలింగానుశాసనము. కావున నీ పదము బోధించునది స్త్రీ సే యనెడి భావాదులు కేవ లద్వైతభావప్రతిపాదకమగు లోకవ్యవహారమునకు మాత్రమే సామాన్యముగ నావశ్యకములు. లౌకిక ప్రక్రియలందును సర్వత్ర యీ లింగానుశాసనవిధి వర్తింపదు. "దారా"శబ్దము పుంలింగము కదా. తత్త్వార్థబోధమునం దవి నిరర్థకములు. ఇపుడాచారమందున్నను లేకున్నను సర్వశబ్దములను ప్రత్యేక ముగ మూఁడు లింగములందునుఁ బ్రయోగింపవచ్చునెడి మహర్షి నిర్ణయమును గలదు. "భాషా స్వైకదేశీ" అనియును, "అనిత్యః" అనియును, "లౌకికోఽత్ర విశేషేః" అనియును, "వ్యాకరణాత్" అనియును, "తద్ జ్ఞానే ధర్మః" అనియును, "అక్షరాణి వర్ణాః" అనియును, "పదాని వర్ణేభ్యః" అనియును, "తే ప్రాక్" అనియును సూత్రము లుండుటవలన నద్వైత సిద్ధికైన శబ్దధర్మజ్ఞానముచేఁ దత్త్వజిజ్ఞాసాసిద్ధి కలుగును.

తురీయము పరాహంభావమే. ఉపాసింపవలసినది దానినే. అదియే సర్వబీజాత్మ. అదియే ప్రణవాదిధర్మము. వాని తెలుసుకొనుటవలనఁ దత్త్వము తెలియంగనగును.

సృష్టి స్థితి లయామ్నాయముల మూఁటియందును నుపాస్యతత్త్వము దేవీసూక్తమందు స్వాభివ్యక్తయగు దేవియే. ఆ దేవి బ్రహ్మమూలప్రకృతికి భిన్నము కాని తత్త్వము. శ్రీసూక్తము స్థిత్యామ్నాయాధిష్ఠాత్రినిఁ బ్రతిపాదించును. సర్వము నా దేవియే. పురుషసూక్తముకూడ స్థిత్యామ్నాయసంబద్ధమే. దేవీ స్థూలశబ్దమును "దేవీం వాచమజనయంత దేవాః" అని శ్రుతి యుపదేశించుచున్నది. వైఖరీరూపయగు వాగ్దేవియే యీశ్రుతిలక్ష్యము. దేవి సర్వతత్త్వాత్మిక. అన్నివిశేష్యములు దేవికే చెల్లును. అన్ని విశేషణములు నా భావమునే వర్ణించును. అక్షరములును వర్ణములగుటవలన విశేషణభావమును విశేష్యభావమును రెండింటిని నద్వైతాఖండరూపమున నొందియున్నవి. విశేషణ – విశేష్యము లభిన్నములు. సర్వము నా దేవియే. ఆ దేవియే కాలమాయారూపమున బ్రహ్మాండమై యొప్పుచున్నది. యోగమాయారూపమున బిండాండమందుఁ దత్త్వదర్శనము చేయుచున్నది. దివ్యానుభూతులను బ్రదర్శించుచున్నది. మాయాశబ్దమును "యా – మా–" అని వ్యత్యస్తముగఁ జూచి యర్థము తెలియు నాచారమును గలదు. అదియును శాస్త్రసమ్మతమైనను ఒకటవతరగతి వేదాంతవిద్యార్థులందుల కధికారులు. వాయుభావ మాకాశభావమున లయించుటను "యా – మా" అను వివరణము తెల్పును. కావునఁ బరిణామశీలమైన వాయుభావము తనకు మూలమైన యాకాశమున లీనమగుటవలన

నిత్యానిత్యతత్త్వము నెఱిగించుటకై వివరింపఁబడినది. నిత్యముగా నెఱుంగఁబడుచున్న భావపదార్థనిత్యముగా నెఱుంగఁబడినపు డది సూక్ష్మరూపము నొంది తనకు మూలమగు దాని యందుఁ జేరినదనియే యర్థము "మూలానురోధి చ స్థితం సర్వం" అని సూత్రము. ప్రవృత్తి నెఱుంగుటకు 'మాయా' యను క్రమమునఁ దద్ధర్మము నెఱుంగవలయును. ఇట్టియెడ "మాతృత్వం యాతీతి మాయా" అను వివరణము సమంజసమైనది.

శ్రీ శ్రీయానందనాథదీక్షానాములగు సద్గురుదేవులు రచించిన "శ్రీ - సత్య - నారాయణ - శర్మ - సాధనము" సాధకలోకమునకు మాతృతత్త్వముంగూర్చి నిజమగు వెలుఁగును బ్రసాదించుచున్నది. యోగమాయ బ్రహ్మాత్మసాక్షాత్కారమును గలిగించుచున్నది. సాంప్రతికాదిగను వైఖర్యాదిగను భిన్నాభిన్నస్వరూపయై సర్వానుభూతులను గలిగించుచున్న దీ మాయ. వృథా తర్కాపేక్షులు ఖండనఖండఖాద్యసారాంశమును క్షీరనీరన్యాయమున గ్రహించి తర్కవాదములకు స్వస్తిచెప్పి, అనామాఖ్యయును ననిర్వాచనీయశక్తియు నగు శ్రీమాతను శరణుజొచ్చుటవలన నైహికాముష్మికములు సిద్ధించును.

సదసత్స్వరూపయగునది దేవి; అదియే బ్రహ్మభావను. సత్తత్త్వమువలన నసత్తత్త్వనిర్ణయము జరుగును. రెండును నవినాభావసంబద్ధములు. 'దేవీం వాచం' అనఁగా వాగ్దేవి యని యర్థము. సర్వమును దన కభిన్నమగుటనే యూదేవి యద్వితీయార్థబోధకమగు 'అహం' అను శబ్దముచే స్వాభివ్యక్తయైనది. శ్రీసూక్త, పురుషసూక్త, దేవీసూక్తములందు

‘అహం బ్రహ్మాస్మి’ అను నద్వైతజ్ఞానమును బ్రసాదించునది దేవీసూక్తమే. శ్రీసూక్త పురుషసూక్తములు పరోక్షతత్త్వ ప్రధానములు. ఈ రెండింటికిని సమాహారమగుచు నద్వైతా పరోక్షానుభూతిని బ్రసాదించునది దేవీసూక్తము. సర్వబీజాత్మిక యగుటచే ‘అహం’ శబ్దముచే స్వాభివ్యక్తమైనది. వ్యక్తమగునంతదాక నీ దేవి ప్రధానబ్రహ్మము. బ్రహ్మశక్తియే దేవి. ఆమెయే మహామాయ. బ్రహ్మము నవమాంకదర్శితము. ఇది సంఖ్యాసామరస్య రహస్యవిజ్ఞానము. కావుననే “సర్వం సర్వేణ సంయోజ్యమ్” అని ప్రవచింపబడినది. శ్రీతత్త్వమందాద్యము భువనేశ్వరీభావము భువనేశ్వరీబీజ త్రిపురభావము వలన శ్రీవిద్యాసిద్ధి. ‘హ్రీంకారత్రయసంపుటేన మనునోపాస్యా’ అని శ్రీశంకరభగవత్పాదులు. సర్వమును శాక్తమే.

దేవి యష్టవర్గోత. దేవీశబ్దమునందలి బీజసంఖ్యా సామరస్యము దానిని సూచించును. దేవీసూక్తమం దెనిమిది ఋక్కులు. “సమాహారాంతర్గతం మండలాష్టకమ్” అని నిర్ణయము. అటులే పాణినీయ శబ్దశాస్త్రమష్టాధ్యాయి. ప్రణవ మష్టమరసము. అందువలన నదియును శక్తియే. అది శాక్తము. “స ఏష రసానాం రసతమః, పరమః, పరార్థ్యోఽష్టమో యదుద్గీథః” అనియును. “చైతన్యమాత్ర మోంకారం” అనియును శ్రుతి. దేవి శశికళాప్రధాన. తిథులు శశికంగములు. ‘తిథిశ్శరీరం తిథిరేవ కారణం తిథిం వినా చాపి శశీ న దృశ్యతే’ అని యుపదేశము అష్టమి దుర్గాష్టమియు కృష్ణాష్టమియునై యున్నది. చాంద్ర శ్రావణ మాసమున కృష్ణజననము. శ్రవణనక్షత్ర ప్రధానము శ్రావణము. నక్షత్రములకు గ్రహనియంతయగు దేవత శశి. కృష్ణపక్షము యోగమాయాత్మకము.

కృష్ణజననము కృష్ణాష్టమి. యోగమాయ, బృందావనము, కాళింది మొదలగునవి సాంకేతిక సంజ్ఞలు. ద్వాపరము కామనారూపము. కావున నిచ్ఛానిష్ఠము. త్రేతాయుగము క్రియానిష్ఠము. అపంచభూతాత్మకమగు కాళీభావము కృష్ణావతారము. పంచభూతాత్మకమగు తారాభావము రామావతారము. ఒకఁడు శ్రీకృష్ణుఁడు, నల్లనివాఁడు. ఒకఁడు శ్రీరాముఁడు, నీలవర్ణుఁడు ఇరువురికిని శ్రీకారమే బీజము. 'వర్ణః కామో త్తరో వర్ణాఖ్యా' అని సూత్రము. 'తత్తన్మంత్రాద్యక్షరం వై మంత్రబీజముదాహృతమ్' అని యుపదేశము. కాళీఘట్ట దక్షిణేశ్వర కాలికాలయములందలి శ్రీకృష్ణప్రతిష్ఠలు ఉదాహరణములు.

కైవల్యేచ్ఛాపరులకు దేవీసూక్తమునుఁ త్రిశతియును పారాయణ యోగ్యములు. ఐహికేచ్ఛాప్రధానులగు ముముక్షువులకు శ్రీసూక్తము సప్తశతియును పారాయణయోగ్యములు. పదపదార్థముల సామరస్యము సాంఖ్యనిర్ణయమునఁ దెలియఁబడును. పద బీజ సంఖ్యా రేఖా సామరస్యము గురుముఖైకవేద్యము.

ఇఁక నేనెవరు ? దేవీసూక్తమందు స్వాభివ్యక్తమగుచున్న యహంభావమనే. శ్రుతులు:- (1) వాగ్వై వసిష్ఠా (2) వాగ్వై శర్మ (3) వాచం దేవా ఉపజీవంతి విశ్వే, వాచం గంధర్వాః పశవో మనుష్యాః, వాచీమా విశ్వా భువనాన్యర్పితా (4) వాగగ్రేగా అగ్ర ఏతి ఋజుగా దేవేభ్యో యశో మయి దధతీ ప్రాణాన్ పశుషు ప్రజాం మయి చ యజమానే చ. (5) యదాఽతమ స్తన్న దివా న రాత్రిర్నసన్నచాసచ్ఛివ ఏవ కేవలః, తదక్షరం తత్సవితుర్వరేణ్యం ప్రజ్ఞా చ తస్మాత్

ప్రసృతా పురాణీ (6) వాగక్షరం ప్రథమజా ఋతస్య వేదానాం మాతాఽమృతస్య నాభిః సా నో జుషాణోపయజ్ఞమాగాత్ అవంతీ దేవీ సుహవా మే అస్తు॥

శాక్తాద్వైత నిరూపణము సంపూర్ణము.
ఓం హ్రీం వనాక్ష్యై స్వాహా॥

*    *    *

## ఆధునిక విజ్ఞాన పరిసమాప్తి, శక్తిజిజ్ఞాసా ప్రారంభము

Every particle of physical matter, is in a continuous state of motion. Nothing is ever still, although some part of the physical matter appears to the physical eye, to be motionless. There is no solid physical matter, in the usual sense, we generally feel it. The hardest piece of steel for example, is a mass of revolving molecules, atoms and electrons, in an order. The nature of the electrons is the same, i. e., they carry either a positive charge or a negative charge. All the electrons move at a same rate of speed.

All the matter is in a constant state of vibration. The molecules of an element are made up of moving particles called atoms. Such atoms are made up of moving particles called electrons and so on. In every particle of matter, there is an invisible Fluid-Force, which causes the atoms to circle around one another, at an inconceivable rate of speed. Some scientists beleived it to be electricity. Some others prefered to call it vibration. This Fluid-force vibrates. It is its nature. One rate of vibration of this Fluid-force causes sound. The human ear can detect only the sound which is caused from 32,000 vibrations per second, to 38,000 vibrations per second, of the Fluid-force. As the rate of vibrations per second, increases above the rate of vibrations that cause sound, they begin

to manifest themselves in the form of heat. Heat begins with about 15,00.000 vibrations per second. Still higher rate of vibrations upto 30,00,000 per second, causes light in various colours upto violet, which are visible to the naked eye. Still more higher rate of vibrations causes, ultra violet rays and other radiations which are invisible to the naked eye. The highest rate of vibrations which are unknown to any one, generates a power with which a human being thinks. Excepting the various rates of vibrations, causing the various appearances of the physical universe, the nature of this Fluid-force is the one and the same and as such universal.

This Fluid-force or Fluid-energy or whatever one may call it, has never been analysed, by the modern scientists. It has baffled the entire scientific modern world. And here the modern scientific world has placed its mark of Full-stop, wherefrom the ancient Saakthadvithins of India, had commenced the course of their spiritual practice and reached their goal. In sanskrit this energy is termed as Sakthi and from it the Cult Saktha is derived. This Fluid-energy is termed as Jala Jyothi in vedas. Our vedic scientists, by spiritual courses, involved themselves and transformed into this fluid-energy and in that energetic fluid-vision they experienced the entire existence as one unbounded single unit without any qualitative internal differences. They became all powerful.

"Chaithanya swarupa—Chichhakthih."

— **Sakthi Meemamsa.**

(1) స్థూలదృష్టికిఁ గనుపించెడు పదార్థము లన్నియును సహజముగ స్పందించుచునేయున్నవి. స్పందించుచుండుట వలననే యవి కనుపించుచున్నవి. అవి నిస్పందాత్మకములగు నెడ నదృశ్యములగును. స్పందించుట యననేమి? వస్త్వంతర్గతము

లగు నణ్వాది సూక్ష్మతరాంశములు పరిభ్రమించుటయే. ఇట్టి పరిభ్రమణము సర్వసామాన్యమగు మానవదృష్టికి గోచరము గాదు. కఠినతరమగు పాషాణమునందు సైతము నణ్వాదులు తీవ్రవేగమునఁ బరిభ్రమించుచున్నవి. ఈ పరిభ్రమణము క్రమబద్ధమైనదియే. ఐనచో నీ యణ్వాదులకుఁగల పరిభ్రమణ శక్తి స్వరూపమెట్టిది? ఆధునిక శాస్త్రజ్ఞులు కొందఱు దానిని విద్యుచ్ఛక్తి యని నమ్మిరి. కొందఱు స్పందశక్తి యనిరి. అందఱును దానిని స్వభావమునుబట్టి (Fluid-Energy) ద్రవ శక్తి యని మాత్రము విశ్వసించిరి. ద్రవశక్తి యగుటవలన విద్యుచ్ఛక్తియే గావచ్చునని కొందరి విశ్వాసము. అది యదృశ్యశక్తి యగుటవలనను, దానియందలి స్పందనక్రియ సార్వకాలిక మగుటవలనను నది స్పందశక్తియే యగునని మఱికొందరి ప్రగాఢవిశ్వాసము. కాని జగద్గురు శ్రీ శంకరులు మాత్రము దానినే "మహామాయే విశ్వం భ్రమయసి" యని మహామాయగ ధ్యానించిరి. మహామాయా స్వరూప మీ గ్రంథమున విమర్శింపఁబడినదిగదా! జ్ఞప్తియందుంచుకొనఁ గలరు.

(2) స్పందగుణము శబ్దము. ఒక పరిమితిగల కాలమం దొక్కసారి స్పందించిన శబ్దమావిర్భవించుచున్నది. అట్టి శబ్దమును మానవులు వినఁజాలరు. అంతియే కాలమునందు 32,000 మొదలుకొని 38,000 పర్యాయములు స్పందించిన నావిర్భవించు శబ్దమును మాత్రము మనము వినఁగలుఁగుచున్నాము. అదే పరిమితిగల కాలమునందు స్పందాంశములు తీవ్రమగు చుండుకొలఁదియును, క్రమముగ వాయువు, తేజస్సు, జలము, పృథ్వి మొదలగు మహాభూతములును జరాచర భూత సము

దాయమును పరిణమించుచున్నవి. అదేకాలమందు 30,00,000 కంటె నెక్కుడుగా స్పందించుచున్నపుడు గలుగు భావములుగూడ నదృశ్యములుగనే యుండును. మనశ్శక్తిగా బరిణమించును. అదేకాలప్రమాణమునందు స్పందాంశములెన్నియుండునో విచారించగా, నవి యనంతములని తెలియుచున్నది. ఒకే ప్రమాణముగల కాలమందు గలుగు స్పందాంశ సంఖ్యావిభేదమువలన పశుపక్ష్యాది విభిన్నరూపములు గలుగుచున్నవి. ఈ స్పందనక్రియ మనశ్శక్తికి లోబడియే యుండుట సంఖ్యాంశము. సిద్ధులందదియే సువ్యక్తము.

(3) ఒకే పరిమితిగల కాలములో ప్రత్యేక వస్తువులందును గలుగు స్పందనములందు సంఖ్యావిభేదమున్నను, ఆ స్పందనము ఒకే ద్రవశక్తివలన గలుగుచున్నది. అట్టి ద్రవశక్తిని (Fluid-Energy) వేదము "జలజ్యోతి" అని దర్శించుచున్నది. మనస్సును జ్ఞాతయందు జేర్చి జలజ్యోతిస్పందనము నందలి యొక్క పరిమితమగు సంఖ్యను తన కిష్టమగు పరిమితిలోనికి మార్చుకొనినచో, సాధకుడు తనకిష్టమగు రూపమును బొందగలడు. ఇట్లుగా మరూపసిద్ధి కలుగగలదు. జలజ్యోతి యొక్క ప్రథమపరిణామము శబ్దశక్తి. అందువలన నా శబ్దశక్తిం బ్రయోగించియే స్పందసంఖ్యను మార్చవలసియున్నది. శబ్దము బీజరూపమునగలదు. బీజములవలన మంత్రము లుద్భవించినవి. మంత్రోపాసనమున, నియమితకాలములో, శబ్దశక్తి ప్రయోగమువలన, స్పందసంఖ్యను మార్చుకొని "యో యదిచ్ఛతి తస్య తత్" అను శ్రుతి ప్రవచించినటుల సర్వార్థసిద్ధిం బొందవచ్చును. స్పందాంశమును నిస్పంద మొనరించుచో, జలజ్యోతియందు సాధకుడు లయించును. అదియే ముక్తి.

“అథ శబ్దేనైవా శబ్ద మావిప్రష్క్రియతే । అథ తత్ర ఓమితి శబ్దోఽ నేనోర్ధ్వ ముత్క్రాన్తోఽ శబ్దే నిధనమేతి। అథాహైషా గతి రేత దమృత మేతత్ సాయుజ్యత్వం నిర్వృతత్వం చేతి॥” అని శ్రుతి వచించుచున్న అశబ్ద మీ జలజ్యోతియే. అశబ్ద మనగా శబ్దమునకు మూలప్రకృతి యని అర్థము. ఈ జల జ్యోతిని (Fluid-Energy) దెలియ సాధ్యముగాదని యాధునిక శాస్త్రజ్ఞులు వదలిరి. అపౌరుషేయమగు శ్రుతి మాత్రము దీనినే “తద్దర్శనం సదా ఆచార్యమూలమ్” అని దానిని దర్శించెడు మార్గము నుపదేశించుచున్నది.

(4) ఈ ద్రవశక్తిని (Fluid-Energy) తేజోమయ మన వచ్చును. తేజస్సునందు ద్రవగుణము గలదు. తేజోద్రవమునే శ్రుతి “అమృతము” అని దర్శించినది. అట్టి యమృత స్వరూపమే జలజ్యోతి. ద్రవమునకు నేదియైన యడ్డుగ నిలచి నచో, దానిని దప్పుకొని తొలగిపోవు స్వభావము గలదు. తేజఃకిరణములును నటులనే యడ్డునిలచిన పదార్థములను దప్పుకొని ప్రక్కకు దొలగి ముందునకు సాగిపోవును. ఆధునిక ప్రయోగములుగూడ దీనిని నిరూపించినవి. ఈ జల జ్యోతినే వేదాగ్ర దృక్పథమున రసస్వరూపముగ శ్రుతి యభివర్ణించినది. ఇదియే షోడశాంతస్థ తురీయచైతన్యముగ భాసించుచున్నది. భ్రూదహరాదుపరిస్థితమగు సచ్చిదానంద తేజఃకూట రూపమిదియే. జగత్తు చిద్వివర్తము. ఈ వివర్తన క్రియయే స్పందకార్యము. జలజ్యోతియందును విశేషించి చిత్తే శక్తి. జలజ్యోతి చిన్మయము. అమృతమందును ద్రవ గుణము గలదు. అమృతత్వము నొందుట యనగ సర్వాంత రస్థమగు నీ జలజ్యోతి స్వరూపమునందు లయించుటయే.

సర్వాంతరస్థ చైతన్యప్రాప్తి యగునదియే మోక్షము. తత్ప్రాప్తికి సాధనములగు నుపాసనాది విధులు గురుముఖైక వేద్యములు. ఈవిధముగ శ్రుత్యుక్తమగు నే జలజ్యోతిని మన ముపాసించి యెఱింగి పొందుచున్నామో దాని స్వభావము నెఱుంగుటనునది సాధ్యముగానిదని యాధునిక శాస్త్రజ్ఞులు తిరోగమించి యున్నారు.

(5) శ్రుతి:- "భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా।
పుమాం స్తద్ధి భవేచ్ఛీఘ్రం॥"

సాధకునిచే నేవస్తువు నిశ్చయాత్మకమగుఁ దీవ్రవేగముచే భావింపఁబడునో, సాధకుఁడావస్తుభావము నే పొందును. తీవ్రవేగముతో ననఁగఁ దద్వస్తుభావప్రాప్తికిఁ దగునంత స్పందాంశావేగముతోడనని భావము. (The required number of Vibrations of the Fluid-Energy per Second) ఇట్లు సాధకుఁడు సర్వసిద్ధులను బొందఁగలుఁగుచున్నాఁడు. మానవరూపమున నుండుటకుఁ దగినన్ని స్పందాంశములు మనయందున్నవి. ఇష్టరూపమునకు దగినన్నిగా వానిని మార్చుకొనఁగలిగినపుడు, సాధకుఁడిష్టరూపము నందఁగలఁడు. సముపాసనమునందు జరుగునట్టి దిదియే. అందులకుఁ గావలసిన శబ్దబీజమును భావించుట వలన స్పందాంశముల సంఖ్య మారును. తదనుగుణమగు భావప్రాప్తి కలుగును. దేవీబీజజాపకుఁడు దేవియే కాగలఁడు. ఇందు సందేహము లేదు. ఒక ముఖ్యాంశము. ప్రత్యేక విభిన్నభావములందు స్పందాంశముల సంఖ్యయందు విభేదమున్నను, వానికి మూలమగు జలజ్యోతి యొకటియే యగుటవలన నద్వైతమునకు సిద్ధి కలుఁగుచున్నది. అద్వైతసిద్ధి పారమార్థిక దృక్పథమునందు మాత్రమే సిద్ధించు

చున్నదనుట మఱువరాని యంశము. ఉపాసనాసిద్ధి యందలి ధర్మనిరూపణమునకుదాహరణముగ 'జ్ఞేయం భ్రమరకీటవత్' అని శ్రుతి భ్రమరకీటన్యాయమును జూపుచున్నది.

"భావితం తీవ్రవేగేన" అనుదానియం దుపదేశింపఁబడిన భావనాబలమెంతయో, యోగవాసిష్ఠమునందలి దశబ్రహ్మల కథయందు పాఠకులు బాగుగ నెఱుంగఁగలరు. ఇదియునుంగాక—

"దేహావసాన సమయే - చిత్తే యద్యద్విభావయేత్।
తత్ తదేవ భవేజ్జీవ - ఇత్యేవం జన్మకారణమ్॥"

అని శ్రుతి వచించుచున్నది. విశేషించి జీవనిష్క్రాంతి సమయమున సహజముగ సర్వప్రాణులకును భావనాబలము తీవ్రవేగమును గలిగియుండి నిశ్చయాత్మకముగ నుండును. అపు డేవస్తువు సహజతీవ్రమగు భావనమందు లక్ష్యమగునో, తద్భావమునే తదనంతరము పొందుచున్నాఁడు. చిత్తమందుఁ గలిగిన వస్తువిభావనా తీవ్రతవలన తన స్పందాంశములు, లక్ష్యవస్తుస్పందాంశములుగఁ బరిణమించుటవలన, మఱల నావస్తురూపమున జననమందుచున్నాఁడు. ఇదియే పునర్జన్మకుఁ గారణము. నిష్క్రాంతిసమయమున బ్రహ్మతత్త్వమునందే లక్ష్యము కుదురుచో బ్రహ్మసాయుజ్యము ప్రాప్తించును.

ఇట్టి తత్త్వధర్మము నెఱింగి జిజ్ఞాసువులు, సద్గురు కటాక్షమును బొంది, యుపాసనా విధానము దెలిసికొని, యచంచల విశ్వాసముతోడను, అనన్యచింతనముతోడను, స్వోపాస్యదేవతా తాదాత్మ్యము నొందుదురుగాక!

శ్రీమన్నారాయణీ స్మృతిః.

# నే నె వ రు ?

## ఉ ప సం హా ర ము

(1) నే నెవరు ?

తత్ త్వమసి.

తత్ పదార్థ మెట్టిది ?

సచ్చిదానంద స్వరూపమే తత్ పదార్థము. నేను సచ్చిదానందస్వరూపము. నాభావము సచ్చిదానందభావము. సర్వమును సచ్చిదానందస్వరూపమే. సచ్చిదానందమే. శ్రుతి తత్త్వబోధప్రధానము. తత్త్వబోధార్థమై దానిని విభిన్నైక దృక్పథమునఁ దత్త్వత్రయరూపముగ నెఱుంగుచున్నాము. ఆ తత్త్వత్ర..మె సత్-చిత్-ఆనందము. వీనినే క్రమముగ 'బీజము, శక్తి, కీలకము' అని యెఱుంగవలయును. ఇదియే వేదాంతసిద్ధాంతసారము. సద్బీజము. చిచ్ఛక్తి. ఆనందకీలకము. ఇందుఁ గేవలము సద్భావోపాసకులును గలరు. వారు బీజోపాసకులు. చిద్భావమునుపాసించువారును గలరు. వారు శాక్తులు. చిత్తత్త్వమునకే శక్తియనునది నామాంతరము. కావునఁ దదుపాసకులు శాక్తులు. శాక్తులకు చిత్తునుఁ దదభిన్న చైతన్యమును నఖండైకపూర్ణభావము. బీజకీలకములకు సమాహారాఖండైకభావము చిత్. అదియే పూర్ణము. కావుననే పూర్ణమగు చిదుపాసనమునకు శ్రుతులందుఁ బ్రాధాన్య

విశాలముగఁబడుచున్నది. ముద్రలందుఁ జిన్ముద్ర యెట్లు మహాశక్తివంతమైనదో తత్త్వములందును నట్లనే చిదన్వయ చిదుపాసనాత్మకమగు శాక్తము మహాశక్తివంతమైనది. విశేషించి అది యద్వైతమగుటవలన శాక్తాద్వైత నామమున విలసిల్లుచున్నది.

(౨) ఇట్టిచిచ్ఛక్తినే శ్రుతులు మహానారాయణీ స్వరూపముగ నుపదేశించుచున్నవి. ఉన్నది మహానారాయణీతత్త్వమొక్కటియే. అట్టి మహానారాయణీశక్తి స్పందనమువలన మహానారాయణాది విజృంభణము కలుగుచున్నది. అట్టి నారాయణతత్త్వము త్రిపాద్విభూతిమయము. అందుండి ఏకపాద నారాయణ తత్త్వప్రవృత్తి కలుగుచున్నది. అట్టి ప్రవృత్తియే శివాదిక్షిత్యంతభావము. ఈ త్రిపాదైక పాదాఖండవిభూతియే ఆధునిక మేధావులచే Four Dimensional Time-space Continuum అని దర్శించఁబడినది. (శ్రీ శ్రియానందనాథుల "అమ్మతో ముచ్చటలు" అను గ్రంథమునందుఁ బ్రథమ పద్యముననే సర్వవిభూతుల సారాంశమును దర్శింపఁబడి ధ్యేయతత్త్వము నిరూపింపఁబడినది. విశేషము లందుండి గ్రహించగలరు.)

(౩) శ్రుతిః- యేదేవా, దేవ్యశ్చ, శాక్తాః శతసహస్రశస్తేభ్యో నమోనమః। భగవన్తో-సుమద న్వనుగృహ్ణన్తు॥ యేమంత్రా - యావిద్యా - స్తేభ్యో నమస్తాభ్యశ్చోన్నమః। తచ్ఛక్తిరస్యాః ప్రతిష్ఠాపయతి॥

సర్వవిద్యలును శాక్తనామాంతరములే. సర్వమంత్రములందును, సర్వవిద్యలందును శక్తియే ప్రతిష్ఠింపఁబడియున్నది. అట్లుపాసియందు విశేషించియును, నధికారవిభేదము ననుస

రించియును, శైవ వైష్ణవ శాక్తములను భేదము పరిగణించు చున్నది. ప్రస్తుతము సర్వసామాన్యముగ నాచారమందున్న శైవాదులు వేదోక్తములైన క్రమధర్మముల ననుసరించు చున్నపుడే, అవి వైదికములు గాగలవు.

శ్రుతిః- శ్రుత్యా యదుక్తం పరమార్థమేవ । తత్ సంశయో నాత్ర తతః సమస్తం । శ్రుత్యా విరోధో న భవేత్ ప్రమాణం । భవే దనర్థాయ వినా ప్రమాణమ్॥

పారమార్థికమును, దివ్యజ్ఞాన దృగ్గోచరమును నగు తత్త్వమును మాత్రమే శ్రుతులుపదేశించుచున్నవి. అట్టి జ్ఞాన దృష్టియందంతర్బహిర్భావము లఖండైకభావమై గోచరించు చుండును. అందువలనఁదత్త్వజిజ్ఞాసయందు తత్ స్వరూపపూర్ణ జ్ఞానానుభూతికి శ్రుత్యుక్తములే ప్రమాణములు. తదన్యములు, తత్ తత్ కర్తృవిజ్ఞానావధి కనుగుణములై యుండును. శ్రుతి పారమార్థికముగ సర్వమునకు నైక్యముఁ బ్రబోధించు చున్నది. ఇది లౌకికవిజ్ఞానమునకుఁ గేవలము భిన్నమైనదనుట మఱువరానియంశము.

(4) శ్రుతిః- యైరేవ జాయతే రాగో మూర్ఖస్యాధిక తాంగతైః ।
తైరేవ భాగైః ప్రాజ్ఞస్య విరాగ ఉపజాయతే॥

ఏ పదార్థదర్శనమువలన నజ్ఞానికి నత్యధిక రాగము జనించుచున్నదియో, ఆ పదార్థదర్శనమువలననే జ్ఞానికి విరాగము జనించుచున్నది. కారణమేమి? దృక్పథములు భిన్నములగుటయే. అందువలన నొక పదార్థమును విమర్శించునపుడు, విమర్శించువాని దృక్పథము నెఱుంగుటావశ్యకము.

శ్రుతిః- యథా సు నిపుణః సమ్యక్ పరదోషేక్షణే రతః।
తథా చేన్నిపుణః స్వేషు-కో న ముచ్యేత బంధనాత్॥

తెలివిగలవారు ఇతరుల దోషములనెంచుట కెట్లు సహజముగ గోరుచుందురో, అటులనే తమయందెట్టి దోషములు గలవో ఎంచుకొనుట యందునుఁ దెలివిగలవారగుచో, తప్పక తప్పుదారులనుండి ముక్తులగుదురు. విభిన్న దృక్పథములందు విభిన్నావధులకు లోబడి, సర్వమును సత్యమే యను యథార్థము నెఱుంగఁగలరు. అట్టివారిని అరిషడ్వర్గము లంట నేరవు. వారు ముక్తులగుట కడుసులభము. పై సత్యములను గ్రహించి సర్వమును సమన్వయించుకొనవలయును.

(5) స్ఫురతి యత్ తవరూప మనుత్తరం।
స్ఫురతి యచ్చ జగన్మయ మంబికే।
ఉభయ మేత దనుస్మరతాం।
సతామభయదే వరదే పరదేవతే॥ నమః పరదేవతాయై॥

శ్రుతిః:- సిద్ధాంతోఽధ్యాత్మ శాస్త్రాణాం - సర్వాపహ్నవ ఏవహి।
నావిద్యాస్తీహ - నోమాయా - శాన్తం బ్రహ్మేదమక్లమమ్।
శాంత ఏవ చిదాకాశే - స్వచ్ఛే శమ సమాత్మని।
సమగ్ర శక్తిఖచితే బ్రహ్మేతి కలితాభిధే॥

పూర్ణతత్వజ్ఞులకు సిద్ధాంతములతో బనిలేదు. అవిద్యా మాయా అని గ్రహించుటకు నిమిత్తము వారలకు గనుపించుట లేదు. శాన్తమై బ్రహ్మతత్వ మొకటియే తెలియుచున్నది. శాని చిదాకాశమందు, స్వచ్ఛమును, శమసమమును నగు ఆత్మయందు తల్లయులై, సమగ్రమగు శక్తి బ్రహ్మతత్వమై భాసించునట్టివారికిమాత్రమే అట్టి పూర్ణస్థితి సిద్ధించుచున్నది. అట్టి పూర్ణదీక్షాపరులగు మహాతత్వజ్ఞుల దృక్పథమందు సర్వమును బ్రహ్మతత్వమే. తదన్యము లేదు. వేదాంత తత్వజ్ఞులు విభిన్న సహజ దృక్పథములందు ఏభావమున,

నెఱుంగుచున్నను ఆతత్త్వము నే దర్శించుచున్నారు. అది సద సద ఖండతత్త్వము.

శ్రుతిః- నిరానందోఽపి సానందః సచ్చాసచ్చ బభూవ సః।
తతస్తు సంబభూవాసౌ - యద్గిరామప్యగోచరః।
యచ్ఛూన్యవాదినాం శూన్యం బ్రహ్మ బ్రహ్మవిదాంచ యత్।
విజ్ఞానమాత్రం విజ్ఞానవిదాం యదమలాత్మకం।
పురుషః సాంఖ్య దృష్టీనాం - ఈశ్వరో యోగవాదినాం।
శివః శైవాగమస్థానాం కాలః కాలైకవాదినాం।
యత్ సర్వశాస్త్ర సిద్ధాన్తం యత్ సర్వహృదయానుగం।
యత్ సర్వం సర్వగం వస్తు యత్ తత్త్వం తదసౌస్థితః॥
యదనుక్తం అనిష్పందం దీపకః తేజసామపి।
స్వానుభూత్యైకమానం యత్ తత్త్వమ్ తదసౌస్థితః॥
యదేకం చాప్యనేకం చ సాంజనం చ నిరంజనం।
యత్ సర్వం చాప్యసర్వంచ యత్ తత్త్వం తదసౌస్థితః॥

ఇట్టి స్థితి యందు, స్వానుభూత్యైకమానమై, తత్ పదార్థమెట్లనుభూతికి వచ్చుచున్నదో అదియే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను శ్రుతికిఁ గోచరమగుతత్త్వము. అదిస్థితి. అది సగుణనిర్గుణాఖండ భావము.

శ్రుతిః- సగుణ నిర్గుణ స్వరూపం బ్రహ్మ। సర్వం ఖల్విదం బ్రహ్మ॥

ఇదియే శాస్త్రాద్వైతతత్త్వము. ఇదియే నాస్వరూపస్థితి 'నే నెవరు' అను జిజ్ఞాసయందుఁ గలిగిన అనుభూతి ఇదియే.

(6) విద్యాంగముగ నవిద్యను, నిర్గుణాంగముగ సగుణమును, ఉపాసించుటవలన నుపాసకు లమృతత్త్వము నొందుచున్నారు.

శ్రుతిః- అవిద్యయా మృత్యుం తీర్త్వా। విద్యయాఽమృత మశ్నుతే॥

ఇక నవిద్య యన నేమియో యెఱుంగవలయును. చతుర్దశవిద్యలును అవిద్యాస్వరూపములే. విశేషించి సహజ గుణముగు 'ఇచ్ఛ' అవిద్య. ఇచ్ఛామూలముననే సముపాస నాది కార్యములు సాధ్యములు. ధర్మార్థ కామమోక్షములు ఇచ్ఛయిందుఁబడుచున్నవి. ముముక్షుత్వమం దిచ్ఛగలవారి మోక్షాపేక్షయు నవిద్యయే. అందువలన సర్వమును నవిద్యా మూలమున సిద్ధించుచున్నది. ఇచ్ఛాసిద్ధియేగాదా సిద్ధి. ఇచ్ఛయేగా అవిద్య.

శ్రుతి:- ఇచ్ఛామాత్ర మవిద్యేయం । తన్నాశో మోక్ష ఉచ్యతే॥

పై శ్రుతి యందలి "నాశః" అనుశబ్దమునకు 'నిస్పందము' అని అర్థము. స్పందాంశము లయించుటయే నాశము. సర్వమును సర్వమునకు మూలమగు తత్త్వము ననురోధించుచుండుట స్వాభావికము. సర్వమును నే తత్త్వమునుండి నిర్గతమగుచున్నదో అట్టి తత్త్వమే మాతృతత్త్వము. ఇచ్ఛామూలమునఁ జతుర్విధ పురుషార్థములును నిర్గతము లగుచున్నవి. అందువలన నిచ్ఛాశక్తిని మాతృభావమున నుపాసించుటే సర్వోపాసనా లక్ష్యము. నివృత్తి క్రమమునందు సర్వకారణ కారణ మిచ్ఛాశక్తియే. ప్రవృత్తి క్రమమునందును నిచ్ఛాశక్తియే సర్వకారణకారణమనుట శ్రుత్యుక్తము. "మూలానురోధచ స్థితం సర్వమ్" అను సూత్రసారాంశమును గ్రహించిన వారి కీ తత్త్వరహస్యము కరతలామలకమువంటిది.

శ్రుతి:- అసదేతదితి జ్ఞాత్వా - మాతృభావం నివేశయ॥

పై శ్రుతియందు మాతృభావమున బ్రహ్మతత్త్వము నుపాసించు రహస్యార్థము గర్భీకృతమై యున్నది. శ్రీ శ్రీయానంద

నాథుల "ఒక్క మహాశక్తిని మాతృభావమున ముక్తాలంబు సేవించెదన్" అను సద్భావముపకు తత్త్వార్థమును బోధించగల ధీశాలురకు పై యంశములు సుస్పష్టములు. వేదాంత ద్రష్టలగు మహర్ష్యాదులందఱును సముపాసనము వలననే తత్త్వము నెఱింగిరను సత్యమునకు నుపనిషత్తులే ప్రమాణములు. బ్రహ్మనో, విష్ణువునో, శివునో, మహావిష్ణువునో, అథర్వణునో, అన్నపూర్ణయగు విశాలాక్షీదేవినో, తత్ తదితరులనో, యుపాసించి వేదద్రష్టలు వేదముల నెఱింగిరనుటకు, వేదములకంటె వేరొక ప్రమాణములేదు. ఋభు నిదాఘునకు, దానెట్లు జ్ఞానానుభూతిం బొందినదియును నెఱింగించుట ఇందులకొక్కయుదాహరణము. కేవల పఠన శ్రవణాదులవలనఁగాక సముపాసనమువలననే జ్ఞానానుభూతి కలుఁగునను సత్యమెఱుంగఁదగినది.

శ్రుతి:- ఉమాసహాయం పరమేశ్వరం-ప్రభుం త్రిలోచనం।
నీలకంఠం ప్రశాంతం ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం॥
సమస్తసాక్షిం తమసః పరస్తాత్॥

పై శ్రుతివలన సముపాసనాదుల ప్రాముఖ్యము తెలియుచున్నది. సముపాసనాఫలము "గచ్ఛతి భూతయోనిమ్" అనియును, భూతయోనిపదార్థము "సమస్తసాక్షిం తమసః పరస్తాత్" అనియును బోధింపఁబడినవి. "తమసః పరస్తాత్" అనునది సర్వస్వరూపమగు దివ్యచైతన్యజ్యోతిని దర్శించుచున్నది.

శ్రుతి:- సర్వేషాం జ్యోతిషాం జ్యోతిః - తమసః పర ఉచ్యతే।
యదేక మవ్యక్త మనంత రూపం_విశ్వం పురాణం తమసః పరస్తాత్
తదేవ ఋతం - తదు సత్యమాహుః। తదేవ సత్యం - తదేవ బ్రహ్మ॥

అట్టి తేజఃపుంజాకృతియే దేవ్యాకృతి. ఆ తత్త్వమే శ్రీ మాతృతత్త్వము. అట్టి తత్త్వము నైక్యము నొందుటకు సాధనము శ్రీవిద్యోపాసనము. శ్రీవిద్యోపాసనాసిద్ధి నిష్కాములకే కలుగును. శ్రుతి:- "నిష్కామానామేవ శ్రీవిద్యా సిద్ధిః । న కదాపి సకామానా మితి॥"

"యతో వా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతికి లక్ష్యము శ్రీమాతృతత్త్వమేయనుట పూర్వగ్రంథమున నిరూపింపఁబడినది. అదియే అవ్యక్తస్వరూప విశ్వరూపము. ఆ జ్యోతియే శ్రీ నారాయణీ, భువనేశ్వరీ, దేవీ తత్త్వత్రయాత్మకమై శ్రీమాతృపూర్ణరూపమున శ్రీమత్ త్రిపురసుందరియై, సుందరీశబ్దవాచ్యయై భాసించుచున్నది.

"సర్వమంగళ మాంగళ్యే । శివే సర్వార్థసాధికే ।
శరణ్యే త్ర్యంబకే ! దేవి ! నారాయణి నమోఽస్తు తే॥"

(7) కావున సగుణోపాసనమువలనఁ దత్ఫలమగు నిర్గుణతత్త్వము దర్శింపఁబడుచున్నది. అదియే పొందఁబడుచున్నది. నిర్గుణమనఁగ, గుణము లెందుండి జనించుచున్నవో, ఎందు లయించుచున్నవో అట్టి శ్రీమాతృతత్త్వ మని అర్థము. త్రివిధశబ్దభేదముల నెఱింగినవా రిందలి సత్యమును గుర్తింపఁ గలరు. అందువలన నుపాసనమనఁగ సగుణోపాసన మనియే సిద్ధించుచున్నది. ఉపాసనము పూర్ణఫలప్రదమైనపిమ్మట సగుణ నిర్గుణ భేదము లయించఁగా అది సగుణనిర్గుణాఖండాత్మోపాసన మగుచున్నది.

(8) స్మృతులందు పురుషశబ్దము సందర్భానుసారముగ సాధకజిజ్ఞాసువు నుద్దేశించియును, తదభిన్నమునుఁ దచ్ఛబ్ద

వాచ్యమును నగు బ్రహ్మతత్త్వము నుద్దేశించియును బ్రయోగింపఁబడియున్నది. 'పురుషః' అనినంత మాత్రముననే దత్త్వజిజ్ఞాసువగు పుంలింగితత్త్వమొకటియే లక్షితము గాదు. తత్పదార్థ త్వం పదార్థము లభిన్నములగుటవలన, జిజ్ఞాసువును లక్షించుచును, బ్రహ్మపదార్థమును లక్షించుచును, సందర్భానుసారముగఁ బురుష శబ్దము ప్రయుక్తమగుచున్నది. 'పురుషః' అను శబ్దము విశేషించి కొన్ని యెడల "అహం బ్రహ్మాస్మి" అను మహామంత్రసిద్ధిం బొందిన జీవన్ముక్తుఁడగు పూర్ణుని లక్షించియును బ్రయోగింపఁబడుచున్నది. ఇవి ముఖ్యముగ గమనార్హములగు నంశములు. 'పురుషః' అనఁగ సామాన్యశబ్దార్థము బాహ్యాత్మ యని యెఱుంగవలయును. బాహ్యాత్మ, అంతరాత్మ, పరమాత్మ యని మూఁడువిధములుగ విభిన్నవధులందు ఆత్మస్వరూపము వేదములందెఱుంగఁబడుచున్నది. అందు బాహ్యాత్మభావమునకుఁ బర్యాయపదముగఁ బురుష శబ్దము సామాన్యముగఁ బ్రయుక్తమగుచున్నది. సాంఖ్యతత్త్వమునందు పురుషశబ్దార్థము, అస్మత్ప్రత్యయగోచరమగునట్టి అర్థమే. సర్వతత్త్వైక్యమును బ్రబోధించునదియే వైదిక శబ్దశాస్త్రమనునది గ్రహించవలసిన ముఖ్యాంశము.

(9) సర్వోపాస్య దేవతలును సాధకుని శరీరమునందే సూక్ష్మబీజరూపమున నున్నారు. బీజరూపమున నున్న యట్టి తత్త్వమును బ్రవృద్ధమొనరించి, సాక్షాత్కారమునొందునటుగను జేయవలసిన యుపాసనాదికమునందు ముఖ్యములగు అస్త్రములు దేహములందున్నవి. శ్రీతత్త్వమును దర్శించుటకు సాధనము

లగునట్టి అగ్నులు మూఁడును దేహమందుండుట వలన దేహమునకు శరీరమను సంజ్ఞ కలిగినది.

శ్రుతి:- శరీరమితి కస్మాత్॥ సాక్షాదగ్నయో హ్యత్ర శ్రియన్తే।
జ్ఞానాగ్ని ర్దర్శనాగ్నిః కోష్ఠాగ్ని రితి॥

అట్టి శరీరమునందు 'నేను' - 'అహమ్' - అనునది యొకటి యున్నది. దేహాంతర్గత సర్వబీజ సమాహారమగు నట్టిదియే 'అహమ్' అను తత్త్వము అది యెట్టిదనగ—

శ్రుతిః:- అహమ్ బ్రహ్మస్వరూపిణీ, మత్తః ప్రకృతి పురుషాత్మకంజగత్॥

అస్మచ్ఛబ్దవాచ్యమగు ఆత్మస్వరూపమే ఆతత్త్వము. ఆతత్త్వమే దేవి. మహాచైతన్య స్వరూపిణియగు శ్రీమాతయే ఆత్మస్వరూపము. అట్టి ఆత్మతత్త్వము తన్నుదానభివ్యక్త మొనరించుకొనుచున్నది. అది స్వాభావికము. మొదటఁ బ్రకృతిగను, బిదపఁబురుషతత్త్వముగను గ్రమాభివ్యక్తమైనది అందు ప్రకృతి తద్ధర్మము. పురుషభావము తద్ధర్మి. ధర్మము సూక్ష్మాంతరంగము. ధర్మి స్థూలమగు బహిరంగము. అను క్రమమునఁ బ్రకృతివలనఁ బురుషభావము జనించుచున్నటులఁ దెలియనగుచున్నది. పురుషభావమనగ నిచట వస్తుభావము. అదియే పదార్థావరణభూతమగునట్టిది. అట్టి పదార్థావరణ భూతమగు బహిరంగభావమును సామాన్యదృక్కులచే జూచు వారు ఉపాసనాదులఁ జేయవలయును. ఉపాసనాబలమున నుపాసకునకుఁ దదంతర్గత చైతన్యదర్శనముగలుగును. ప్రథమమున నుపాసకుఁ డొకవస్తువును జూచును. ఉపాసించి దాని తత్త్వము నెఱుంగగ నది చైతన్యమాత్రమని యెఱుంగ గలుగును. పరిణామ ధర్మవశమునఁ జైతన్యమే విభిన్న వస్తు భావములఁ గనుపట్టుచున్నది. పరిణామము స్వాభావికమైనది.

కావునఁ జైతన్యమే వస్తువు. వస్తువే చైతన్యము. దీనిని ఆధునిక శాస్త్రవేత్తలలో నగ్రగణ్యుడగు Dr. Einsten గారు "Concentrated energy is matter" అన్నారు.

మహాచిదేకైవేహాస్తి మహాసత్తేతి ప్రోచ్యతే
నిష్కలంకా సమా శుద్ధా నిరహంకారరూపిణీ,
సకృద్విభాతా విమలా నిత్యోదయవతీ సమా
సా బ్రహ్మ పరమాత్మేతి నామభిః పరిగీయతే॥

అట్టి శ్రీతత్వము నుపాసించుటకుఁగల మహామంత్రములలో శ్రుతులు రెండింటిని ముఖ్యాతి ముఖ్యములుగ నుపదేశించు చున్నవి. అవి (1) ప్రణవము (2) హృల్లేఖ.

## ప్ర ణ వ ము

శ్రుతిః :– ఓమిత్యేకాక్షరం బ్రహ్మ.

శ్రుతిః :– ఓమిత్యే తదక్షరం పరం బ్రహ్మ.

ప్రణవము బ్రహ్మతత్వ దర్శనమందును, తత్ సాయుజ్య ప్రాప్తియందును వినియోజ్యము.

శ్రుతిః :– చైతన్యమాత్ర మోంకారమ్.

ప్రణవము కేవలము చైతన్యమాత్ర మైనది. ఇందష్ట విధములగు క్రమభేదములుగలవు. వానియందు అష్టమము శక్తి.

శ్రుతిః–స చాష్టధా భిద్యతే। అకారోకారమకారార్థమాత్రా నాదబిందుకలా శక్తిశ్చేతి॥

అనుక్రమమున నుపాసకుఁడా శక్తిభావమునం దైక్యమగుటయే ప్రణవోపాసనము వలనఁగలుగు సాయుజ్యముక్తి.

అష్టమరసమగు ఓంకారము అష్టమమగు శక్తియందు లయించుటచేతను, శక్తిభావమందు లయించుటే ప్రణవోపాసనమునందలి సాయుజ్యముక్తి తత్వమగుటచేతను అది శాక్తమై భాసించుచున్నది. దానినే సర్వము ననుభాసించుచున్నది. ఓంకారమునందలి శక్తివిభాగము, ఉపాసకుని దేహమునందు ద్వాదశాంతమున నున్నది. అంతిమమగు శక్తియందు లయించినపుడు పునరావృత్తిరాహిత్యము కలుగుచున్నది.

శ్రుతిః- హ్రస్వోదహతి పాపాని - దీర్ఘో మోక్షప్రదాయకః॥
శ్రుతిః- నాసాగ్రే చిత్తసంయమాద్ ఇంద్రలోకజ్ఞానమ్॥

ఇత్యాద్యనేకశ్రుతులవలనఁ బ్రణవోపాసనావిశేషములును, విశేషించి ముప్పదితొమ్మిదివిధములగు సంయమమార్గములును దత్తత్సిద్ధులునుఁ దెలియుచున్నవి. ప్రణవోపాసనాపూర్ణసిద్ధింబొందిన సాధకుఁడు, అశబ్దమునందు లయించును. అశబ్దమనఁగా శబ్దసూక్ష్మభావము. అది యమృతత్వము.

శ్రుతిః- ద్వేఃవావ బ్రహ్మణీ అభిధ్యేయే - బహ్మాశ్చాశబ్దశ్చ । అథ శబ్దేనైవాశబ్దమావిష్క్రియతే । అథ తత్ర ఓమితి శబ్దోఽనేనోర్ధ్వముత్క్రాంతోఽశబ్దేనిధనమేతి । అథాహైషాగతి రేతదమృత మేతత్ సాయుజ్యత్వం నిర్వృతత్వం తథాచేతి॥

## హృల్లేఖ

శ్రుతులు హృల్లేఖకునుఁ బ్రణవమునకును దుల్యమగు ప్రాధాన్యము నొసంగుచున్నవి. ప్రణవహృల్లేఖలు సర్వవిధములందును సామ్యమునందియున్నవి. హృల్లేఖయే ప్రణవహృల్లేఖ.

శ్రుతి:- వియదీకార సంయుక్త వీతిహోత్ర సమన్వితాం।
అర్ధేందులసితం దేవ్యా బీజం సర్వార్థ సాధకం।
ఏవమేకాక్షరం మంత్రం యతయ శ్శుద్ధచేతసః।
ధ్యాయన్తి పరమానందమయాః జ్ఞానాంబు రాశయః॥

శ్రుతిః:- య ఏతాం మాయాంశక్తిం వేద స పాప్మానంతరతి- సోఽమృతత్వంచ గచ్ఛతి-మహతీం శ్రియమశ్నుతే మీమాంసంతే బ్రహ్మవాదినో హ్రస్వావా, దీర్ఘావా, ప్లుతా వేతి। యదిహ్రస్వా భవతి సర్వం పాప్మానందహతి - అమృతత్వంచ గచ్ఛతి। యదిదీర్ఘాభవతి మహతీంశ్రియ మాప్నుయాత్-అమృతత్వంచ గచ్ఛతి। యదిప్లుతా భవతి జ్ఞానవాన్ భవతి - అమృతత్వంచ గచ్ఛతి॥... ... ...

ఆకాశం బీజం విద్యాత్-తదేతద్ ఋషిణోక్తం నిదర్శనమ్-హగ్ంసః శుచిషద్-వసురంతరిక్షసద్-హోతా వేదిషద్ అతిథిర్దురోణసత్-నృషద్వరసద్-ఋతసద్ వ్యోమసద్ అబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్ య ఏవం వేద॥

ఈవిధముగ హంస భావము హృల్లేఖగ నుపదేశింపఁబడుచున్నది. ఈ ఏకాక్షర మహామంత్రము సర్వార్థసిద్ధిదము. హంసమంత్రమును ప్రణవమును నభేదము నొందియున్నవి.

శ్రుతిః:- హంసప్రణవయోరభేదః॥

ఇట్లు ప్రణవ హృదయమై, తాదాత్మ్యము నందియున్న హృల్లేఖ శ్రీవిద్యయం దుత్తమాంగమై భాసించుచున్నది. హృల్లేఖాసంపుటీ కరణమువలన శ్రుత్యుక్తమగు పంచదశికి సిద్ధికలుగుచున్నది. పంచదశి శ్రీశంకరాచార్యాది జగద్గురువులుపాసించినట్టిది. విశేషించి శ్రీ విద్యారణ్యమునీంద్రులు హృల్లేఖోపాసనము వలన ముక్తులైరి.

హ్రీం హ్రీమితి ప్రతిదినం జపతాం తవాఖ్యాం।
కింనామ దుర్లభ మిహ త్రిపు ధిపాని॥ అనియును,
హ్రీంకార మేవ తవనామ తదేవ రూపమ్॥ అనియును

"యాం జ్ఞాత్వా సకలమపాస్య కర్మబంధం।
తద్విష్ణోః పదం పరమం ప్రయాతిలోకః॥" అనియును,

శ్రీ జగద్గురువులు హృల్లేఖోపాసనా ప్రాశస్త్యము నుపదేశించియున్నారు. శ్రీమచ్ఛంకరాచార్యులు, త్రిమూర్తులకు పరంజ్యోతి వచనములుగ నిట్లుపదేశించియున్నారు.

"యయాకాశ స్తమోవాపి - లబ్ధయా నోప లభ్యతే।
పుం నపుంసక యోస్తుల్యా - ఒప్యంగనాను వి శిష్యతే॥

ప్రధానమితి యామాహుః - యాశక్తి రితి కథ్యతే।
సాహం-యూయం-త్రైవాన్యద్ యద్వేద్యం తత్ తు సా స్మృతా॥

మీరును, నేనును, సర్వమును ఆమహాశక్తియే. సర్వమును ఆ దేవియే. ఈ దేవీతత్వమునే శ్రీ భువనేశ్వరి యనియును, శ్రీ నారాయణి యనియును నందురు. బీజముగ నారాయణియును, శక్తిగ భువనేశ్వరియును, కీలకముగ దేవియును నై హృల్లేఖాఖండభావ మొప్పుచున్నది సంపూర్ణ శాక్తాద్వైత జిజ్ఞాసను రానున్న "ఈశావాస్యోపనిషద్ వ్యాఖ్య" యందుఁ జూడగలరు. రానున్న వ్యాఖ్యయును శ్రీ గురు కైంకర్యమునందే వినియోగము గానున్నది.

(11) మహత్తరమగు శాక్తమంత్రాగమ జిజ్ఞాసను శ్రీమద్ గౌడపాదాచార్య మునీంద్రులు శక్తిమీమాంసా సూత్రరూపమున రచించి సాధకలోకమునకు మహోపకారము గావించిరి.

"అథ శాక్త మంత్రాగమ జిజ్ఞాసా॥
ఆత్మైవాఖండాకారః॥
చైతన్యస్వరూపా చిచ్ఛక్తిః॥
సైవేయ మనామాఖ్యా శ్రీవిద్యా॥
తత్వత్రయేణ సా వివిధా॥
కోణపత్ర సముచ్చయం చక్రమ్॥
గగనప్రభావడ్ వసుకోణ వసుపత్ర స్వరధరణీ
భువనేశీ సదనమ్॥"

ఇత్యాదిసూత్రములు శాక్తమంత్రోపాసనామార్గదర్శకములు.

(12) ఈ యుపాస్యదేవతా రూపాదులు తత్వజ్ఞులకు మాత్రమే బోధపడగలవు.

శ్రుతిః- చిదిహాస్తీతి - చిన్మాత్రమిదం - చిన్మయమేవచ ।
చిత్త్వం - చిదహం - ఏతేచ లోకాః చిదితి భావయ ॥

శ్రుతిః- చిన్మయస్యాద్వితీయస్య - నిష్కళస్యాశరీరిణః ।
ఉపాసకానాం కార్యార్థం - బ్రహ్మణో రూపకల్పనా ॥
రూపస్థానాం దేవతానాం - పుంస్త్ర్యంగాది కల్పనా॥
ద్వి - చత్వారి - షడ్ - అష్టాఽఽసాం - దశ - ద్వాదశ - షోడశ ।
అష్టాదశామీ కథితా హస్తాః - శంఖాదిభిర్యుతాః ।
సహస్రాన్తస్తథా తాసాం వర్ణవాహన కల్పనా ॥
శక్తిసేనా కల్పనా చ బ్రహ్మణ్యేవంహి పంచధా ।
కల్పితస్య శరీరస్య తస్య సేనాది కల్పనా ॥
బ్రహ్మాదీనాం వాచకోఽయం మన్త్రోఽన్వర్థాది సంజ్ఞకః ।
జప్తవ్యోమంత్రిణా - నైవం వినా దేవః ప్రసీదతి ॥
క్రియా కర్మేతి కర్త్రాణామర్థం మంత్రో వదత్యథ ।
మననాత్ త్రాణనాన్మంత్రః - సర్వవాచ్యస్య వాచకః॥

సోఽభయస్యాస్య దేవస్య - విగ్రహో యంత్ర కల్పనా ।
వినా యంత్రేణ చేత్ పూజా - దేవతా న ప్రసీదతి ॥

పై శ్రుతియందు 'కల్పనా' అనుశబ్దార్థము నెఱుంగుటత్యావశ్యకము. స్వాభావికమగు ప్రకృతివివర్తనమే కల్పన.

శ్రుతిః- కల్పనా - సర్వభూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః ।
కాలశబ్దేన నిర్దిష్టం హ్యఖండానంద మద్వయమ్ ॥

ఈ కాలశబ్దార్థమునే ఆధునిక శాస్త్రజ్ఞులు Time-Space లోని Time అను అఖండవిభాగమును నెఱుంగుచున్నారు. Time creates its events. Time is an order of events. ఆధునికులు దృశ్యప్రపంచమునందలి బహిరంగ రూపమునే Four Dimensional Time - Space Continuum గా నెఱుంగుచున్నారు. ఆత్మశక్తి సంపన్నులగు మహర్షులు,

| | |
|---|---|
| Eight Dimensional Evolution | 8 |
| Ten Dimensoinal Involution | 10 |
| Eighteen Dimensional Spiritual Existence | 18 |

అనువానినిగూడ దివ్యశక్తివలన దర్శించిరి. అట్టి తత్త్వములే శ్రీ దేవీ స్వరూపాంతర్గత మహాలక్ష్మీ - మహాకాళీ - మహాసరస్వతీ స్వరూపములు. ఆయా స్వరూపములందలి ఆయుధవిశేషములు సాంకేతిక గణితచిహ్నములు. విశేషించి అవియే సర్వమునకు నాధారమగు మహాబీజములు. అట్టి శ్రీమహాశక్తియొక్క సర్వభావమును మహాశాక్తులగు శ్రీ గురువుల వలన నధికారులెఱింగి ముక్తులై సర్వస్వరూపముగ బ్రహ్మభావము నొందుదురుగాత.

శ్రుతి:- అంతర్లక్ష్య జలజ్యోతిః స్వరూపం భవతి। పరమగురూపదేశేన సహస్రారే - జలజ్యోతిర్వా - బుద్ధిగుహానిహిత జ్యోతిర్వా - షోడశాంతస్థ తురీయ చైతన్యం వా - అంతర్లక్ష్యం భవతి॥ తద్దర్శనం - సదా - ఆచార్యమూలమ్॥

శ్రుతి:- దేవీహ్యేకాగ్ర ఆసీత్। సైవ జగదండ మసృజత్॥ తస్యాఏవ బ్రహ్మా అజీజనత్। విష్ణురజీజనత్। రుద్రోఽజీజనత్॥ సర్వంశాక్త మజీజనత్। యదస్తి సన్మాత్రమ్। యద్విభాతి చిన్మాత్రం। యత్ ప్రియమానందం। తదేదత్ సర్వాకారా మహాత్రిపురసుందరీ॥

శ్రుతిః:- ప్రజ్ఞానం బ్రహ్మ॥ అహం బ్రహ్మాస్మి॥ తత్ త్వమసి॥ అయమాత్మాబ్రహ్మ॥

శ్రుతిః:- ఆత్మనేఽస్తు నమో - మహ్యా మవిచ్ఛిన్న చిదాత్మనే॥

ఇతి శ్రీమన్నారయణీ స్మృతిః
శ్రీ పగానంద నాథః.

ఓం హ్రీం నమః.



జానకిరాం ప్రెస్, తెనాలి.

పిబన్తు వాఙ్మయసుధామ్



తరన్తు భవసాగరమ్

## ఆధ్యాత్మిక సాధక లోకమునకు అపూర్వావకాశము

శ్రీకాశీవాసి, శ్రీ శివానందనాథులు

### శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి రచనలు

### సిద్ధముగ నున్నవి :

| | | |
|---|---|---|
| 1. | సౌందర్యలహరి. | 0–12–0 |
| 2. | శ్రీ సత్యనారాయణశర్మ సాధనము | 1– 8–0 |
| 3. | శ్రీ దేవీసూక్త పరమార్థము | 0–12–0 |
| 4. | భీమేశ్వర నుతి | 0– 8–0 |
| 5. | దేవపూజా రహస్యము | 1–12–0 |
| 6. | శాస్త్రసాధన (తయారగుచున్నది) | |

### రా బో వు న వి :

1. అమ్మతో ముచ్చటలు 1, 2 భా. (ఓంకారిణీసమీక్షాసహితము)
2. శ్రీ సిద్ధాంత శిఖామణి వివరణ (వీరశైవ గ్రంథరాజము)
3. శ్రీ విద్యాంధ్రభాష్యము
4. సప్తశతీ (చండీపాఠ) తత్త్వసారము
5. సప్తశతీ (చండీపాఠ) విపులాధ్యాత్మికా వివరణము
6. రుద్రకోటీశ్వర శతకము
7. హ్రీంకార శతకము.

ప్ర తు ల కు :

## సాధన గ్రంథ మండలి, తెనాలి.